LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM
Visit Internet Edition @ www.zaminryot.com "e-mail editor@zaminryot.com"

# జమీన్‌రైతు





స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు సంపుటి : 71 సంచిక : 40 6.10.2000 శుక్రవారం 12 పేజీలు విడిప్రతి : రూ.2.00లు జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

కేంద్ర క్యాబినేట్ మంత్రిత్వం పొందిన తొలి నేతగా వెంకయ్య నాయుడు పేరు జిల్లా చరిత్రలో నిలిచిపోతుంది!

# ఢిల్లీ గద్దెపై నెల్లూరు రైతుబిడ్డ!

మన వెంకయ్యనాయుడుగారు మంత్రి అయ్యారు; ఆషా మాషీ మంత్రిత్వం కాదు; కేంద్ర క్యాబినెట్ మంత్రిగా ప్రమాణ స్వీకారం చేశాడు. గత యాభై ఏళ్ల చరిత్రలో ఒక నెల్లూరీయుడు ఢిల్లీ సర్కారులో క్యాబినెట్ మంత్రికావడం ఇదే ప్రథమం. స్వాతంత్ర్యం వచ్చిన తొలినాళ్లలోనే జవహర్‌లాల్ నెహ్రూ క్యాబినెట్లో పనిచేసే అదృష్టం డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారికి దక్కినప్పటికీ, అది సహాయ మంత్రిత్వం మాత్రమే. డాక్టర్ చింతా మోహన్ కూడా స్టేట్ మంత్రి. పులి వెంకటరెడ్డి డిప్యూటీ మంత్రిగా మాత్రమే వుండినారు. క్యాబినెట్ హోదా పొందగల్గిన భాగ్యం ఇప్పుడు వెంకయ్యనాయుడు గారికి లభించింది. జిల్లా చరిత్రలో ఆయన పేరు చిరస్థాయిగా నిల్చే సౌభాగ్యం ఇది.

ఎక్కడ చౌటపాలెం; ఎక్కడి ఇంద్రప్రస్థం? వెంకయ్య నాయుడు జీవితంలో నిజంగా ఇదొక మహాప్రస్థానం. పల్లెటూరు సేద్యంతో పొద్దుపుచ్చే కుటుంబం నుంచి, దేశ పరిపాలనను శాసించే నాయకత్వానికి ఎదగడానికి నాయుడు గారు చాలా దూరం ప్రయత్నించాడు. ఎవరో పరిచిన రహదారిలో సాగిన ప్రయాణం కాదిది; తనకు తానుగా రాచబాట నిర్మించుకుని నడవగల్గడం, గమ్యం చేరగల్గడం వెంకయ్యనాయుడు సమర్థత. దేముడిచ్చిన వరం అని తేలికగా కొట్టిపారేస్తున్నాడు (ప్రక్కన ఇంటర్వ్యూ) కాని, దేముడు ఇటువంటి అవకాశాలు చాలా మందికి ఇస్తాడు. అయితే వాటిని సద్వినియోగం చేసుకోగల్గిన సామర్థ్యం వుండేది మాత్రం కొందరికే. ఆ కొద్ది మందిలో నాయుడు గారు ఒకడు.

## పార్టీలకు అతీతంగా ప్రతి నెల్లూరీయుడి హృదయం ఆనందంతో ఉప్పొంగే సందర్భం ఇది!

వాస్తవం చెప్పాలంటే, వెంకయ్య నాయుడు గారికి క్యాబినెట్ మంత్రిత్వం వచ్చిందని నెల్లూరీయులకు సంతోషమే తప్ప, ఆయన ఇప్పుడు వున్న స్థాయికి ఇది పెద్ద గొప్ప హోదా కాదు. జాతీయ రాజకీయాలలో నాయుడు గారి స్థాయి, స్టేచర్ మంత్రిత్వ పరిధి కంటె ఎప్పుడో పైకి పెరిగిపోయాయి. కెవలం పార్టీ రాజకీయాలకు పరిమితమై కూడా దేశంలో, బిజెపి పార్టీలో ఒక వున్నత స్థానం. గుర్తింపు పొందగలిగాడు. బిజెపి కేంద్ర నేతల జాబితా వ్రాయవలసి వస్తే, మొదటి పది పేర్లలో నాయుడుగారిది ఒకటిగా వుంటుంది. ఆ వున్నతి పొందిన వాడికి మంత్రిత్వం పెద్ద గొప్పగా ఎట్లా కన్పిస్తుంది చెప్పండి.

మరీ పోపం ఈ మంత్రిత్వం తనంతట తానుగా వరించి రావడం. పదవి కోసం పెద్ద పెద్ద నేతలు కూడా వచ్చేటట్లు చేసుకోగల్గడం ఎంతో పుణ్యం చేసుకున్నవారికి మాత్రమే సాధ్యం.



పడరాని పాట్లు పడుతున్నారు. కాని, తాము ప్రయత్నం చేయకుండా, పదవులే వాటంతట అవిగా నడిచి తమ ఇంటికి అటువంటి పుణ్యం నాయుడు గారిది. మంత్రిత్వం ఆయన అడగలేదు; వాజ్‌పాయి పిల్చి ఇచ్చాడు. ఒక రకంగా

తొరువ 11వ పేజీలో

# పల్లెటూరి జీవితమే నాకిప్పటికీ ప్రాణప్రదం

కేంద్రమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన వెంటనే వెంకయ్య నాయుడు గారు ఢిల్లీలోని తన ఇంట్లో జమీన్‌రైతు ప్రతినిధితో ముచ్చట్లాడారు. పత్రికలు



క్యాబినెట్ మంత్రిగా ప్రమాణస్వీకారం చేస్తున్న వెంకయ్యనాయుడు. ప్రక్కన రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్

రాజకీయనేతలతో జరిపే లాంఛన ప్రాయపు ఇంటర్వ్యూ కాదిది. ఆ కుటుంబానికి చెందిన ఇద్దరు సభ్యులు కల్సినప్పుడు మనసు విప్పి మాట్లాడుకున్నట్లు జరిగింది సమావేశం. నిజానికి ఆ సమయంలో నాయుడు గారికి వూపిరి పీల్చుకోవడానికి కూడా వ్యవధి లేని పరిస్థితి. అరడజను మంది పార్లమెంట్ మెంబర్లు, పెద్ద సంఖ్యలో విజిటర్లు వచ్చి ఆయనతో మాట్లాడడానికి నిరీక్షిస్తుండినారు. తెలుగుదేశం నేతలు ఇంకొకప్రక్క వేచి వుండినారు. ఒరిస్సా ముఖ్యమంత్రి నవీన్ పట్నాయక్ ఎదురుగా కూర్చొని వుండినారు. చెవిలో జోరీగ మాదిరి సెల్‌ఫోన్ మార్మోగుతూనే వుండింది. ఇంత రద్దీలోనూ సందు చూసుకుని జమీన్‌రైతు ప్రతినిధితో ముచ్చట్లాడాడు నాయుడు గారు. ప్రశ్నలు జవాబుల రూపంలో ఆ ముచ్చట్లు ఇవీ...

జ.రై.: నెల్లూరు జిల్లా నుంచి కేంద్ర క్యాబినెట్ మంత్రిత్వం పొందిన తొలినేతగా జిల్లా చరిత్రలో మీ పేరు చిరస్థాయిగా నిల్చిపోబోతున్నది. దీనిపట్ల మీ హృదయ స్పందన ఏమిటి?

నాయుడు: చరిత్రలో నా పేరు నిలుస్తుందా లేదా అన్నది నేను చేసే మంచి పనులను బట్టి తేలుతుంది తప్ప, కేవలం మంత్రిత్వం పొందడం నా దృష్టిలో చరిత్ర కాదు. అయితే ఒక చిన్న గ్రామం నుంచి, రైతు కుటుంబం నుంచి వచ్చిన నాకు ప్రతి దశలో ప్రజల సహకారం, పార్టీ అండదండలు లభించడం వల్లనే నేను ఇంత దూరం రాగల్గాను. మంత్రిత్వం పొందడం పట్ల నా హృదయ స్పందన మిశ్రమంగా వుంది. పార్టీ పని మానేస్తున్నానన్న అసంతృప్తి ఒక ప్రక్క, ప్రజలకు ప్రత్యక్షంగా సేవ చేసే అవకాశం కల్గిందన్న సంతోషం ఇంకొక ప్రక్క కల్గుతున్నాయి.

జ.రై.: రాజకీయాలలోకి రావాలనే అభిలాష మీకు ఎప్పుడు కల్గింది? ఎందుకు కల్గింది?

నాయుడు: విఆర్ కాలేజి విద్యార్థిగా వున్నప్పుడు నెల్లూరు కాంతారావు వుద్యమం నుంచి వైదొలగారు. దానితో నేను నాయకత్వం వహించాల్సి వచ్చింది. స్వర్గీయ కెవిఆర్, ఆనం భక్తవత్సలరెడ్డి నాకు సహకారం ఇచ్చారు. చివరకు ఉద్యమం ఫలించి, విద్యార్థిపై దాడి చేసిన వారికి శిక్ష పడింది. ఈ చిన్న సంఘటన నన్ను రాజకీయాలకు రప్పించింది.

## జమీన్‌రైతు ప్రతినిధితో వెంకయ్య నాయుడు ముచ్చట్లు

గారు. కనకమహల్ సిబ్బంది ఒక విద్యార్థిపై దాడిచేసి, విపరీతంగా కొట్టారు. దానికి నిరసనగా టౌన్లో ఉద్యమం మొదలైంది. నేను కూడా అందులో పాల్గొన్నాను. అది చాలా చిన్న సంఘటన; పొరపాటున జరిగింది. కాని దానిపై ఉద్యమం మాత్రం పెద్ద ఎత్తున జరిపాం. ఒక దశలో తతిమా విద్యార్థి నాయకులు రకరకాల కారణాలతో

దీనితో నాకు అర్థమైన మరొక నిజం - రాజకీయ పార్టీల సహకారం లేనిదే ఏదీ సాధించలేమని. విద్యార్థులం మేము ఎంత ప్రయత్నించినా జరగనిదని, రాజకీయ నేతలు జోక్యం చేసుకోగానే ఫలితం కన్పించింది. నేను రాజకీయాలలో తల దూర్చడానికి ఈ పరిణామాలే కారణం.

తొరువ 7వ పేజీలో

# సణుగుడు

### * డి.ఐ.జి.గారూ! మీరే దొంగలైనప్పుడు ఇంక దొంగలను మీరేంది పట్టుకునేది!

జిల్లాలో బందిపోటు దొంగతనాలకు పాల్పడిన బంది పోట్లను పట్టుకునేందుకు 9 ప్రత్యేక బృందాలను ఏర్పాటుచేసినట్లు ప్రకటించారు, మన డిఐజీగారు. దినపత్రికలలో ఆ ప్రకటన చూసి నవ్వు వచ్చింది నాకు. దొంగలను పట్టుకోవడానికి కావల్సింది పోలీసులు; కాని నెల్లూరు జిల్లాలో ఇంకా పోలీసులు మిగిలి వున్నారని డిఐజి గారు నమ్మడం నవ్వు తెప్పించే విషయమే కదా?

నాకు తెల్సినంత వరకు నెల్లూరులో పోలీసులు లేరు; వున్నదంతా దొంగలే. బందిపోటు దొంగలు నయం - ఎక్కడో అడవులలో వుంటారు; రాత్రిపూట మాత్రమే రహస్యంగా తిరుగుతారు; తమకు ఎదురు వచ్చిన వారిని మాత్రమే దోచుకుంటారు. కాని నెల్లూరు జిల్లాలోని పోలీసు అధికారులు అట్లా కాదే! వీరు వూళ్ళలోనే వుంటారు, జనం మధ్యనే తిరుగుతుంటారు. జనం పై పెత్తనం చేస్తుంటారు. పబ్లిక్‌గా దోచుకొంటున్నారు. బందిపోట్లను తప్పించుకోవడం ప్రజలకు పెద్ద కష్టం కాదు; కాని పోలీసు పిండారీల పీడను వదిలించుకోవడం నర మానవుడికి అసాధ్యం.

ప్రజలకు రక్షణ కల్గించే ఒక కీలక వ్యవస్థపై ఇటువంటి ఉపమానాలు వాడడం దారుణమని ప్రతి పోలీసుకు అన్పించవచ్చు. కాని వారు చేసే దారుణ నేరాలతో పోల్చి చూసినప్పుడు ఈ ఉపమానాలు చాలా స్వల్పంగా తోస్తున్నాయనడం నిజం.


ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు చేతులమీదుగా సేవాపతకాన్ని అందుకొంటున్న నెల్లూరీయుడు హోంగార్డ్ కెప్టెన్ కమాండర్ హరనాథ్ సింగ్

## డోలేంద్ర

నెల్లూరు జిల్లాలో గత ఏడాది కాలంగా గ్రీన్ గ్లోరి అనే దగాకోరు సంస్థను అడ్డం పెట్టుకుని జిల్లా ఎస్పి నుంచి కానిస్టేబిల్ వరకు ప్రజలను ఎంతగా దోచుకున్నది ప్రతి ఒక్కరికి తెలుసు. ఇది అన్యాయం, ఇది పచ్చి దారి దోపిడీ తనం అని పత్రికలు గగ్గోలు పెడితే ఒక్క అధికారీ చలించలేదు. పైగా ఆ సంస్థ పట్ల ప్రజలలో నమ్మకం కల్గించడం కోసం సాక్షాత్తు ఎస్పి గారు వారి సభలో పాల్గొని, మెరిట్ సర్టిఫికెట్ ఇచ్చారు. మర్రిపాడు బంది పోట్లను పట్టుకోవడానికి డిఐజి గారు కావలి డిఎస్‌పి రెడ్డయ్యను నాయకుడిగా నియమించాడు. కాని ఈ అధికారి కావలిలో జనంపై పడి, బెదరించి, భయపెట్టి ఎన్ని లక్షల రూపాయలు దోచుకున్నది, కొత్త కాబట్టి డిఐజీ గారికి తెలియక పోవచ్చు. కొంచెం ఓపిక చేసుకుని ఏ అంగడి ముందు నిలబడి అడిగినా ఆ పిండారి వార్తలు కథలు కథలుగా విన్పిస్తాయి. ప్రతి ఎస్‌ఐ, ప్రతి కానిస్టేబిల్‌ను వ్యాపారుల నుంచి డబ్బు దండకానికి వాడుకున్నాడు ఈ చిన్న దొరగారు. ఆయన ఇప్పుడు దారి దోపిడి దొంగలను పట్టుకోవడానికి బయలుదేరుతున్నాడంటే నవ్వు కాక ఏడ్పు వస్తుందా?

గ్రీన్ గ్లోరి సంస్థ జనం నెత్తిన టోపి పెట్టి బోర్డు తిప్పిన తర్వాత అయినా ఒక్క పోలీసు అధికారి తాము చేసింది తప్పు అని పశ్చాత్తాపం చెందడం లేదు. జనం రక్తాన్ని జలగల వలె పీల్చి మూటలు కట్టుకున్న సొమ్ము తిరిగి ఇచ్చేద్దామని భావించలేదు; బోర్డు తిప్పిన ఆ ఘరానా మోసగాళ్లను పట్టుకోవడానికి ప్రయత్నించలేదు; నిజం మాట్లాడాలంటే ఆ సంస్థ నిర్వాహకులు కావలి డిఎస్‌పి, నెల్లూరు పాత ఎస్‌పిలకు తెలియకుండా ఎక్కడికి తప్పించుకునే అవకాశమే లేదు. ఈ వ్యాపారం నడిపిందే ఈ ఇద్దరు అధికారులని జనం కోడై కూస్తున్నారు. పారిపోయింది తెర మీది బొమ్మలు మాత్రమే; తెరవెనుక నడిపించిన దొరలు నిక్షేపంగా అధికారం వెలగ పెడుతున్నారు.

ఇంత కఠినంగా విమర్శిస్తున్నందుకు నన్ను పోలీసులు ఎన్ని శాపనార్థాలైనా పెట్టవచ్చు. కాని వారి దుర్మార్గ ధన దాహం వల్ల పోలీసు వ్యవస్థ పట్లనే ప్రజలలో ఎంత విద్వేష భావం ఏర్పడి వుందో తెలుసుకోగల్గితే

తరువాయి 11వ పేజీలో

# పాపం పి.వి.

మాజీ ప్రధాన మంత్రి పి.వి. నరసింహారావును దోషిగా పేర్కొంటూ ప్రత్యేక న్యాయస్థానం ఇచ్చిన తీర్పు దేశ చరిత్రలో ఒక ముఖ్య సంఘటనగా నిల్చిపోతుంది. జార్ఖండ్ ముక్తి మోర్చా కేసులో ఆయన నేరానికి పాల్పడినట్లు నిర్ధారించింది న్యాయస్థానం. పి.వి. ప్రధానిగా వున్నప్పుడు పార్లమెంటలో మెజార్టీ లేదు. అది చూసి ప్రతిపక్షాలు అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టాయి. ఆ గండం నుంచి బయట పడాలంటే అదనంగా ఎమ్పీలు కావాల్సి వచ్చింది. తెలుగుదేశం ఎమ్పీలు కొందరు పార్టీని చీల్చి కాంగ్రెస్‌లో చేరారు; కాని బలం చాలలేదు. జెఎంఎం సభ్యులు నలుగురు ప్రభుత్వానికి మద్దతు ఇవ్వడానికి బేరం పెట్టారు. ఒక్కొక్కరికి 50 లక్షల రూపాయల లెక్కన ఇచ్చేటట్లు ఒప్పందం కుదిరింది. ఆ డబ్బు చేతికి అందగానే వారు పివికి అనుకూలంగా ఓటు చేశారు. అవిశ్వాసం వీగి పోయింది. ఆయన ఆ తర్వాత పూర్తి కాలం ప్రభుత్వాన్ని నడిపారు.

భారత దేశంలో ఎమ్పీలు, ఎమ్మెల్యేలు ఇట్లా ప్రభుత్వ పార్టీలతో బేరాలు జరపడం, డబ్బు లేదా పదవులు పొంది పార్టీలు మార్చడం చాలా సహజ విషయం. కొన్ని వందల సార్లు కొన్ని వేల మంది ప్రజాప్రతినిధులు ఇట్లా అమ్ముడు పోవడం జరిగివుంటుంది. ఇప్పుడు జరుగుతున్నది కూడా అదే. వాజ్‌పాయిని మమతా బెనర్జీ ఎంతగా బ్లాక్ మెయిల్ చేస్తున్నది చూస్తున్నాము. హర్యానాలో ఒక దశలో ఎమ్మెల్యేల పార్టీల మార్పిడి కార్యక్రమం సృష్టించి ఒకే రోజు ఒక ఎమ్మెల్యే నాలుగు సార్లు గోడ దూకిన సంఘటన కూడా వుంది. ఆయారాం, గయారాం అన్న నానుడి స్థిరపడింది అప్పుడే. మైనార్టీ ప్రభుత్వాలు అవిశ్వాసం ఎదుర్కొనేటప్పుడల్లా సాధారణంగా జరిగిపోయే ఈ అవినీతి, పి.వి. మెడకు మాత్రం పామై చుట్టుకున్నది.

రవీంద్ర కుమార్ అనే ఒక న్యాయవాది ఈ వ్యవహారంపై కోర్టులో కేసు దాఖలు చేశారు. దాన్ని నీరు కార్చడానికి, న్యాయపర లిటిగేషన్లలో ఇరికించి దారి మళ్లించడానికి ఎవరు ఎంత ప్రయత్నించినా ఆ న్యాయవాది పట్టిన పట్టు విడువకుండా చివరి వరకు పోరాడాడు. సుప్రీం కోర్టు, హైకోర్టు అతడికి బాసటగా నిలవడంతో ఇది ఇంత దూరం నడిచింది.

ప్రజాప్రతినిధులను కొనుగోలు చేసే సరకుగా మార్చడం తప్పే. కాని ఆ తప్పు కొన్నవారిదే కాదు, అమ్ముడు బోయిన వారిదికూడా. అయితే పార్లమెంట్ సభ్యులకు వున్న ప్రత్యేక హక్కుల మేరకు, సభ లోపల వారు చేసే పని ప్రశ్నించే అధికారం కోర్టులకు లేదన్న రాజ్యాంగ నిబంధనను అడ్డంపెట్టుకొని, డబ్బు తీసుకున్న జెఎంఎం ఎమ్పీలు కేసు నుంచి తప్పించుకున్నారు. పి.వి. తరఫున వీరితో బేరం నడిపింది, లంచంగా డబ్బు ఇచ్చిన వ్యాపారులు, ఇతర రాజకీయ వాదులు కూడా బెనిఫిట్ ఆఫ్ డౌట్ అనే చిన్న లొసుగుతో శిక్ష నుంచి బయటపడ్డారు. పి.వి. నరసింహారావు గారు మాత్రం దొరికి పోయాడు.

ఆయన ప్రధాని అయ్యేనాటికి దేశ రాజకీయ పరిస్థితుల దృష్ట్యా చూస్తే పి.వి. చేసింది చట్ట ప్రకారం నేరమే అయినా, దేశ సంక్షేమానికి ఉపయోగపడింది అది. వి.పి. సింగ్, చంద్రశేఖర్ ప్రభుత్వాలు అర్ధాయుష్షుతో పతనం కావడం, ఆర్థికంగా దివాలా పరిస్థితులు ఏర్పడడం, ప్రపంచ బ్యాంక్ అప్పు చెల్లించడానికి లండన్ బ్యాంకులో ప్రభుత్వం బంగారు తాకట్టు పెట్టవల్సి రావడం, విదేశీ మారక నిల్వలు క్షీణించి, రూపాయి విలువ పతనమై అల్లకల్లోల పరిస్థితులు ఏర్పడడం అందరికీ గుర్తు వుండే వుంటుంది. ఆ నేపథ్యంలో ప్రధానమంత్రి అయ్యాడు పివి. తన చాతుర్యంతో అయిదేళ్ల పాటు రాజకీయ స్థిరత్వం సాధించాడు. ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టి దివాలా దశ నుంచి దేశాన్ని బయట పడవేశాడు. పంజాబులో అశాంతి అణచివేశాడు. ఈశాన్య రాష్ట్రలలోనూ తీవ్రవాదాన్ని అదుపులోకి తెచ్చాడు. అప్పటిలో పి.వి ప్రభుత్వం పడిపోయి, మళ్లీ ఎన్నికలు వచ్చి వుంటే దేశం అరాచకం పాలై వుండేది.

దేశానికి పరిపాలనాపర స్థిరత్వం సాధించిన నేరానికి ఈ అపర వయస్సులో నేరస్తుడిగా జైలు శిక్ష అనుభవించ వల్సి రావడం పి.వి చేసుకున్న దురదృష్టం. ఆయన సచ్చీలుడు, సత్యహరిశ్చంద్రుడు అని చెప్పలేము కాని, ఈనాటి భారతీయ రాజకీయ నేతలతో పోల్చి చూసినప్పుడు పి.వి ఎంతో మెరుగైన నాయకుడు. పరిపాలనా దక్షతలోనే కాదు, అవినీతి ఆరోపణలకు, అక్రమాలు చేశాడన్న నిందలకు లోనుకాని వ్యక్తి ఆయన. పబ్లిక్‌గా

**జమీన్‌రైతు**

ప్రజా ధనాన్ని దోచుకున్న అసంఖ్యాక రాజకీయ నేతలు నిక్షేపంగా తమ పదవులలో, అధికారంలో కొనసాగుతూ, అందరు చేసే తప్పు తాను చేసిన చిన్న నేరానికి ఇంతటి మానసిక క్షోభ అనుభవించాల్సి రావడం దురదృష్టకరం.

అయితే చట్టం ముందు ఎంతటి వారైనా తల వంచక తప్పదన్న భారత రాజ్యాంగ సూత్రాన్ని అమలు చేసి చూపినందుకు ప్రత్యేక న్యాయస్థానం తీర్పును సైతం అభినందించక తప్పదు. ఒక ప్రధాన మంత్రిని దోషిగా నిర్ధారించే సాహసం చేయకల్గిన ప్రజాస్వామ్య దేశాలు ప్రపంచంలో చాలా అరుదుగా వున్నాయి. ఇండోనేషియా, మలేషియా, పాకిస్తాన్ వంటి దేశాలలో పాలకులు న్యాయస్థానాలను తమ చేతిలో కీలు బొమ్మలుగా మార్చడం చూస్తూనే వున్నాం మనం. భారత దేశం అటువంటి కుహనా ప్రజాస్వామిక వ్యవస్థ కాదని, జరిగిన తప్పును సరైన రీతిలో ఎత్తి చూపితే న్యాయం జరిగి తీరుతుందని ప్రపంచాన్ని నమ్మించేందుకు ఈ తీర్పు ఉపకరిస్తుంది.

ప్రధాన మంత్రి స్థాయిలోని వ్యక్తిపైన కేసు దాఖలు చేసి, చివరి వరకు వత్తిడులు లెక్క చేయకుండా లక్ష్యం సాధించిన రవీంద్ర కుమారును అభినందించాలి. సామాన్య ప్రజలలో ఈ ప్రశ్నించే గుణం అలవడితే దేశాన్ని పట్టి పీడిస్తున్న సవాలక్ష సమస్యలు వాటంతట అవిగా సమసిపోతాయి.

పార్లమెంట్ హక్కుల పేరుతో లంచం తిని, తిన్నట్టు వప్పుకుని కూడా న్యాయస్థానాల పరిధి నుంచి తప్పించుకున్న జెఎంఎం సభ్యులు సైతం తమ తప్పుకు శిక్ష అనుభవించేటట్లు రాజ్యాంగాన్ని సవరించడం అవసరం. భవిష్యత్తులో ఏ రాజకీయవాది కూడా మరొకసారి అవినీతికి పాల్పడకుండా ఒక హెచ్చరిక వలె వుండాలి ఈ తీర్పు. లంచం ఇచ్చిన వారు, తీసుకున్నవారు కూడా జైలు కూడు తిన్నప్పుడే దీనికి సమగ్రత; కేవలం పి.వి ఒక్కడే మొత్తం పాపం మోయాలనడం సమంజసం కాదు. *

## జమీన్‌రైతు

6.10.50

వెల: 0-3-0 పేజీలు: 12

### మూడవ ప్రపంచ యుద్ధం వస్తుందా?

ఈ వారం దేశమంతా మహాత్ముని స్మరిస్తున్నది. గాంధీ బోధను మనం మరచినా, గాంధీ నామస్మరణ అయినా మిగిలింది. అంత వరకు మేలే.

బుద్ధుని జీవితం వలె, గాంధీజీ జీవితం సర్వకాల సర్వావస్థల యందూ మానవ కోటికి ఆదర్శప్రాయమైనది.

ప్రపంచంలో నానాటికి క్లిష్టతరమైన పరిస్థితి ఏర్పడుతున్నది. రాక్షస బలంతో పహిల్వాన్ ప్రభుత్వాలు రెండు గోదాలోకి దిగనున్నవి. ఈ రెంటి మధ్య వున్నదంతా నలిగి, నాశనమై పోతుంది. ఉభయులు తగదా తీరే లోపల.

అంత పని జరిగేలోగా, అంత త్వరగా ఉభయులకూ గాంధీ సందేశం వినిపిస్తే శుభమే. హింసవల్ల సమస్యలు పరిష్కారం కావు. సద్బుద్ధి కల్గి నల్గురు ఒకే నైతిక పంథా అవలంభిస్తేనే, లోకం ఒక పద్ధతిగా నడువగలదు. ఇదే గాంధీజీ గావించిన హితబోధ సారాంశం.

### నెల్లూరు ఎలక్ట్రిసిటీ

నెల్లూరు రేటు పేయర్ల సంఘ పక్షమున 1శేది సత్రం వద్ద సభ జరిగింది. విద్యుచ్ఛక్తి విషయంలో పవర్ అండ్ లైటు వారు చేస్తున్న అక్రమాలన్నిటి గూర్చియూ, ప్రభుత్వం ఈ కంపెనీని స్వాధీనం చేసుకొని, ప్రభుత్వం వారే ప్రత్యక్షంగా సరఫరా చేయువల సిందని మున్నగు విషయాల గూర్చి 2శేది విద్యుత్ శాఖామంత్రి




భక్తవత్సలం గారికి రాయబారం నడుపవలసినట్లు తీర్మానించిరి.

ఆ ప్రకారం 2శేది సాయంత్రం మంత్రి గారిని దర్శించి, బాధలన్నియూ తెలిపి ఈ ప్రయివేటు కంపెనీని ప్రభుత్వమే తీసుకోవలసిందిగా కోరిరి. మంత్రిగారు సమాధానం చెప్తూ, ప్రభుత్వం వద్ద డబ్బు లేదనియు, సుమారు 5లక్షలు కావలసి వున్నదనియు, ఆ మొత్తాన్ని ప్రభుత్వం వారికి యీ మండలీయులు అప్పిచ్చిన యెడల భారత ప్రభుత్వం వారి అనుమతిని కోరి తీసుకొంటామనియు సమాధానం

తరువ 10వ పేజీలో

## జనవాణి

# పేదోళ్లపైనే సంస్కరణల 'బాణాలు'

ఆర్థిక సంస్కరణలు పేదలకు మేలు చేస్తాయని సంస్కరణలు అమలులోకి వచ్చిన కొత్తలో ప్రచారం జరిగింది. కాని ఆర్థిక సంస్కరణల వల్ల సంపన్నులకు నిరుపేదలకు మధ్య అంతరం బాగా పెరిగిపోయినట్లు పరిశీలనలు వెల్లడిస్తున్నాయి. ఆర్థిక సంస్కరణలు దారి తప్పి పోతున్నప్పుడు వాటిని దారికి తేవడం ఎంతైనా అవసరం. ఆర్థిక సంస్కరణలలో లోపాలు సవరించి వాటిని పేదలకు మరింత ప్రయోజనకరంగా ఉండేటట్లు ప్రభుత్వం ప్రయత్నించాలి. లేకుంటే ఆర్థిక సంస్కరణల ప్రయోజనమే దెబ్బతింటుంది.

నెల్లూరు కె. రామారావు

### ప్రభుత్వాలు చేస్తున్నదేమిటి?

ధరలు పెంచడం మినహా ప్రభుత్వాలు మరొక పని చేయడం లేదు. వంటగ్యాస్ సిలిండర్ ధర నలభై రూపాయలు పెరగడం. పెట్రోల్, కిరోసిన్ ధర లీటరుకు మూడు రూపాయలు పెంచడాన్ని సామాన్య, మధ్య తరగతి ప్రజలు భరించలేరు. పెట్రోలు ధర పెరుగుదలను అడ్డంపెట్టుకొని ఆర్టీసి ఛార్జీలు పెరిగాయి. దీనికి తోడుగా ట్రాన్స్‌పోర్ట్ ధరలు పెరుగుతాయి కాబట్టి మార్కెట్‌లో అన్ని సరకుల ధరలు పెరిగిపోతాయి. మార్కెట్‌లో పెరుగుతున్న ధరలకు అనుగుణ్యంగా జీవన ప్రమాణాలు పెరగడం లేదు. ప్రజా సంక్షేమాన్ని ప్రభుత్వాలు దృష్టిలో పెట్టుకొంటే ఇలా ధరలు పెంచవు.

నెల్లూరు కె.సాయికుమార్

### ఖజానాపై మరింతభారం

కేంద్ర మంత్రి మండలిలో మంత్రుల సంఖ్య 75కు చేరింది. ఇంత

తరువ 10వ పేజీలో

# నెల్లూరు ఎక్సైజ్ పోలీసులకు 'లిక్కర్' లాభాల 'కిక్కు'

పట్టించుకొనే నాథుడే లేక పోవ డంతో నెల్లూరు టౌన్‌లో పనిచేసే ఎక్సైజ్ పోలీసులు మరీ బరితెగించి పోయారు. నియమ నిబంధనలను ఉల్లంఘించిన బ్రాందీ షాపుల భరతం పట్టాల్సిన వాళ్లు

### బ్రాందీషాపుల్లో విచ్చలవిడితనం

24 గంటలూ షాపుల వద్దే ఊడిగం చేస్తున్నారు. దీనికి రకరకాల కారణా లున్నాయి. లంచాల రూపంలో తాము విపరీతంగా సంపాదించిన మొత్తాలను పలువురు ఎక్సైజ్ పోలీసులు బ్రాందీ షాపుల్లో పెట్టుబడి పెట్టి వున్నారు. తమ పెట్టుబడులకు ఇబ్బడి, ముబ్బడిగా లాభాలు రావాలనే వుద్దేశ్యంతోనే ఎక్సైజ్ పోలీసులే, బ్రాందీ షాపుల యజమానుల్లో సఖ్యత లేకుండా పోయి దెబ్బతిన్న 'సిండికేట్‌ను' తిరిగి చొరవ తీసుకొని ఏర్పాటు చేశారు. దీనివల్ల టౌన్‌లో గతంలో కన్నా ఎక్కువగా బ్రాందీ రేట్లు పెరిగిపోయాయి. బ్రాందీ షాపుల్లో కలెక్షన్ బాగా వుండే సమయం సాయంత్రం 6 గంటల నుంచి రాత్రి పది గంటల వరకు; ఈ సమయాల్లో రిటైల్ కౌంట ర్లలో ఎక్సైజ్ పోలీసులే బ్రాందీ సీసాలు చేతబట్టి మందుబాబులకు మందు పోస్తున్నారు. కొన్ని చోట్ల ఆ ప్రాంత రౌడీషీటర్ల దాడి నుంచి షాపులను

తరువ 12వ పేజీలో



గాంధీ జయంతి సందర్భంలో ట్రంకురోడ్డులోని గాంధీ విగ్రహానికి పూలమాలలు వేసి శ్రద్ధాంజలి ఘటిస్తున్న ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, జెసి. రావత్, మునిసిపల్ కమీషనర్ వేమారెడ్డి, ఛైర్మన్ అనురాధ.

# డి.కె. కళాశాల గబ్బుపట్టి పోయింది - దారికూడా తప్పుతోంది!

ఒకప్పుడు చదువుల తల్లికి కొలువైన డి.కె.డబ్ల్యు మహిళా కళాశాల ఇప్పుడు అక్రమాలకు నెలవయ్యింది. కళాశాలలో అడుగడుగునా అరాచకం చోటు చేసుకుంది. అవినీతి, అన్యా యాలు, అక్రమాలకు, క్రమశిక్షణా రాహి త్యానికి వేదికయ్యింది. ఈ కళాశాలలో ధారాదత్తం చేశారు. జాగ్రత్తగా నిర్వహిం చాల్సిన హాస్టల్ నిర్వహణా బాధ్యతలు అర్హతలేని నాల్గవ తరగతి ఉద్యోగిని చేతిలో పెట్టారు. వందల మంది ఆడపిల్ల లుండే హాస్టల్‌లో రాత్రిపూట వారి సంరక్షణ బాధ్యతలు చేపట్టేందుకు ఏ ఒక్కరూ లేకుండా పోయారు. దీనికితోడు

### గతవైభవ ప్రాభవానికి అవినీతి మబ్బు కమ్మింది

పనిచేసే ఇన్‌ఛార్జ్ ప్రిన్సిపాల్, మరో జూనియర్ అసిస్టెంట్ కుమ్మక్కై విద్యార్థు లకు సంబంధించిన లక్షలాది రూపా యలు స్కాలర్ షిప్పులు ఫోర్జరీ సంతకా లతో స్వాహా చేశారట. కళాశాలలో మెస్సు ల నిర్వహణకు కావాల్సిన వస్తువులు టెండర్లు నిర్వహించి సేకరించాల్సింది పోయి. తమకు కావాల్సిన వ్యక్తికి హాస్టల్‌లోని గ్యాస్ సిలిండర్లు, బియ్యం, పప్పుదినుసులు, నూనె రాత్రిపూట బహిరంగంగా బయటకు తరలిపోతు న్నాయి. అన్నింటికంటే మించి రాత్రి వేళల్లో పురుషులు డి.కె. హాస్టల్లోనికి నేరుగా వెళ్లిపోతున్నారు. ఈ యేడాది ఏప్రిల్ నెలలో ఇక్కడి హాస్టల్‌లో వుండే యువతి బుచ్చిరెడ్డిపాళెంలోని ఒక లాడ్జిలో పోలీసులకు దొరికిపోయి డి.కె. డబ్ల్యు కాలేజి పూర్తిగా దారి తప్పిపోయి వుందని లోకానికి తేటతెల్లం చేసింది.

జిల్లాలోని ఏకైక హాస్టల్ వుండే మహిళా కళాశాల డి.కె.డబ్ల్యు. సామాన్య, మధ్యతరగతి ప్రజలు నిత్యం ఆడపిల్లలు గ్రామాలకు వచ్చిపోవడం ఇబ్బందని ఇక్కడ చేరుస్తుంటారు. హాస్టల్‌లో చదువుకొనే ఎస్‌సి., ఎస్‌టిల కులాలకు చెందిన ఆడపిల్లల వద్ద నుంచి మెస్ బిల్లులు వసూలు చేయకూడదని ప్రభుత్వ ఉత్తర్వు వుంది. కాని ప్రస్తుత ప్రిన్సిపాల్ బలవంతంగా విద్యార్థినుల నుంచి మెస్ బిల్లులు వసూలు చేస్తున్నారు. వాస్తవంగా ఈ మెస్ బిల్లులను స్కాలర్ షిప్పుల నుంచి మినహాయించుకోవాలి. గతంలో నెలకు 400 రూపాయలుగా వచ్చే మెస్ బిల్లులు 900 రూపాయలుగా వస్తుందని విద్యార్థినులు గగ్గోలు పెడుతున్నారు. 99-2000 విద్యా సంవత్సరం ఫైనల్ ఇయర్ చదివిన విద్యార్థినులకు మంజూ రైన స్కాలర్ షిప్పులు కాలేజి ప్రిన్సిపాల్, జూనియర్ అసిస్టెంట్ సహకారంతో, ఫోర్జరీ సంతకాలతో స్వాహా చేశారు. చదువయ్యాక వచ్చే స్కాలర్ షిప్పులు కాబట్టి విద్యార్థినులు వెళ్లి అడిగితే మంజూరు కాలేదన్న కుంటి సాకులు

### నేతల్లారా! కాపాడండి. అధికారులూ! ఆదుకోండి.

చెప్పి పంపించి వేశారు. హాస్టల్‌లో సెల వులకు వెళ్లే విద్యార్థినుల పేరు మీద, హాస్టల్‌లో లేకుండా పోయిన వారి పేరు మీద కూడా ఇక్కడ దొంగ మెస్ బిల్లులు తయారవుతున్నాయి.

హాస్టల్‌కు కావాల్సిన వివిధ నిత్యా వసర వస్తువుల సరఫరాకు టెండర్లు పిలిచి వారిలో తక్కువగా కోట్ చేసినవారికి ఈ వస్తువులు సరఫరా చేసే అనుమతి ఇస్తారు. గతంలో వివిధ అవినీతి ఆరోపణలపై తొలగించిన వ్యాపారికే ఇప్పటికి ఇన్‌ఛార్జ్ ప్రిన్సిపల్ మళ్లీ వస్తువుల సరఫరా బాధ్యత ఇవ్వడం వెనుక ఏదో మతలబు దాగుంటుందని భావించవలసి వస్తుంది. నాసిరకమైన వస్తువులతో భోజనాలు, కూరలు తయారవుతున్నాయని విద్యార్థినులు లబోదిబోమంటున్నారు. చాలీచాలని తిండి పెడుతున్నారనే విమర్శ కూడా వుంది. రాత్రిపూట హాస్టల్ సరుకులన్నీ తరలి పోవడాన్ని అడ్డుకొన్నాడనే ఇటీ వల 60ఏళ్ల వయస్సున్న వాచ్‌మెన్‌ను, ప్రిన్సిపాల్ తొలగించేశారట.

తరువ 12వ పేజీలో

# ఉపాధ్యాయ సంఘాల విలీనం!

ఏఆర్ హైస్కూల్‌లో ప్రధానోపా ధ్యాయుడు ఎం. వాగభూషణం అధ్యక్ష తన జిల్లాలోని ఉపాధ్యాయ సంఘాలన్నీ 1తేది సమావేశమయ్యాయి. జిల్లాలోని ఉపాధ్యాయ సంఘాలన్నీ పోరాట సమి తిగా ఏర్పడి ఏడుగురు సభ్యులతో స్టీరింగ్ కమిటీని ఎన్నుకొన్నారు. జిల్లాలో ప్రస్తు తం జరుగుతున్న రేషనలైజేషన్, బదలీల ప్రక్రియ అమలు సందర్భంలో జిల్లాలోని

## నెల్లూరుసంగతులు

ఉపాధ్యాయ సంఘాలన్నింటిని సమావేశా నికి పిలిచి చర్చించాలని తీర్మానించారు. రేషనలైజేషన్, బదలీల వివరాలను కార్యాలయంలోని నోటీసు బోర్డులో అతికించాలని, పత్రికలకు విడుదల చేసి పారదర్శకత వహించాలని డి.ఇ.ఓను కోరారు. మండల లిటరసీ ఆర్గనైజర్స్ వ్యవస్థను రద్దు చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు ఇచ్చి వున్నా, జిల్లాలో ఈ ఉత్తర్వులు అమలు జరపబడలేదు. దీనివల్ల పలు స్కూళ్లలో బోధనలో తీవ్ర ఆటంకం కలుగుతుందన్నారు. రేషనలై జేషన్ మరియు బదలీల్లో ఎప్పటికప్పుడు విడుదలవుతున్న ప్రభుత్వ ఉత్తర్వులు మార్గదర్శక సూత్రాలను యథావిధంగా అమలు చేయాలని డి.ఇ.ఓను కోరారు. స్టీరింగ్ కమిటీలో ఏ. బాబురెడ్డి, ఎం.వి. క్రిష్ణ, వెంకటసుబ్బయ్య, బలరామయ్య, పోలయ్య, సుధాకర్‌రెడ్డి, ఏ. కోటయ్య వున్నారు.

### జైళ్ల పేరు మార్పు

ఖైదీల సమస్యలు పరిష్కరిం చేందుకు ప్రభుత్వం నిత్యం కృషి చేస్తుందని జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ చెప్పారు. అక్టోబర్ 2తేది ఖైదీల సంక్షేమ దినోత్సవాన్ని పురస్కరించుకొని జిల్లా జైలులో ఏర్పాటైన సభకు ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. సమాజం

తరువ 11వ పేజీలో

# బిల్లులులేని వ్యాపారం-ఖజానాకు భారం

రాష్ట్ర ప్రభుత్వానికి పన్నుల రూపంలో రావాల్సిన కోట్లాది రూపాయల రాబడిని వ్యాపారస్తులు, వివిధ శాఖల అధికారుల సహకారంతో కట్టకుండా ఎగవేస్తూ దర్జాగా వ్యాపారం చేస్తున్నారు. లంచాల అమేధ్యానికి అలవాటు పడి పోయిన అధికారులు లక్షాధికారులై పోతూ ఈ దొంగ వ్యాపారాన్ని ప్రోత్సహి స్తున్నారు. నెల్లూరులో వ్యాపార కూడలి ప్రాంతమైన స్టోన్‌హౌస్‌పేటలో రోజుకు 40లక్షల నుంచి 50 లక్షల మేర కిరాణా వస్తువుల వ్యాపారం జరుగుతుంది. ఇక్కడ వందలాది హోల్‌సేల్, రిటైల్ షాపులున్నాయి. హోల్‌సేల్ వ్యాపారం చేసే వ్యాపారస్తులెవరూ తమ వద్ద కొనే మినపప్పు, పచ్చిశనగపప్పు, పెసలపప్పు, శనగలు, బఠాణీలు, అల్లసందులు, ఎర్రగడ్డలు, టెంకాయలు, వేరుశనగనూనె, పామోలిన్ వంటి సరకులకు బిల్లు లివ్వరు. కాని జిల్లాలోని వ్యాపారస్తు లందరూ బిల్లులే లేకుండా సరకులు తీసుకెళ్లి దర్జాగా వ్యాపారాలు చేసుకొం టున్నారు. చక్కెర, రవ్వ, మైదా, తెల్ల గడ్డలు కొంటే కొన్న మొత్తంలో సగానికి సగం సరుకుకే బిల్లులిస్తారు. దీనివల్ల ఒక్కొక్క వ్యాపారికి వేలాది రూపాయలు ప్రభుత్వానికి చెల్లించాల్సిన అమ్మకపు పన్ను మొత్తం మిగిలి పోతుంది. వివిధ ప్రాంతాల నుంచి లారీల్లో వచ్చే సరకు

### లంచాల జలగలైన అధికార గణం

ఎటువంటి బిల్లు లేకుండా చేతులు తడపడం వల్ల వాణిజ్య పన్నుల శాఖల చెక్ పోస్టులు దాటి నెల్లూరుకు వచ్చేస్తుంది. ఇక్కడ కొచ్చే సరుకులను లారీల్లోంచి దింపను బస్తాకు 3.50 రూపాయలు కూలీ వంతున పొందే ముఠా కూలీ ఒకరు రోజుకు 300 రూపాయలకు పైనే సంపాదిస్తున్నాడు. మినపప్పు, పెసలపప్పు పొట్టు తీసే మిషన్లు 24 గంటలు ఆడుతుంటాయి. కానీ స్టాకు, మూమెంట్ రిజిష్టర్లు ఏ శాఖాధికారి పరిశీలించరు. వివిధ వ్యాపార సంఘాల నాయకులు ప్రతి అంగడి వద్ద మామూళ్లు దండి కమర్షియల్ టాక్స్ అధికారులకు నెలకు 5 లక్షలు, ఇన్‌కంటాక్స్ అధికారులకు 3లక్షలు, విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ శాఖా ధికారులకు 3లక్షలు సమర్పిస్తుంటారు. ఈ మొత్తాలేకాక మునిసిపల్ హెల్త్ శాఖాధికారులు, లేబర్ ఆఫీసు అధికారులు నెలనెలా కొంత మొత్తం షాపుల వారి నుంచి పట్టుకెళ్లి పోతుంటారు. అధికారు లకు వసూలు జేసే మొత్తంలో అసోసి యేషన్ నాయకులు కొంత మొత్తం దిగమింగుతున్నారని స్టోన్‌హౌస్‌పేటలో గగ్గోలుగా వుంది. ఇదిగాక పై శాఖల అధికారుల ఇళ్లకు బియ్యం, పప్పు, ఉప్పు, సబ్బులు మొదలుకొని సమస్తం స్టోన్‌హౌస్‌పేట నుంచే వెళ్లాలి. కమర్షియల్ టాక్స్, ఇన్‌కంటాక్స్, విజిలెన్స్ ఎన్‌ఫోర్స్

తరువ 11వ పేజీలో

# పనిచేయకపోతే, కొట్టి చేయిస్తాం!

## గూడూరు మున్సిపల్ మీట్‌లో అధికార్లపై కౌన్సిలర్ల ధ్వజం

గూడూరు మునిసిపల్ సమావేశం ఛైర్మన్ కోడూరు కల్పలత అధ్యక్షతన వాడి వేడిగా జరిగింది. పట్టణంలోని నెలకొన్న నీటి సమస్య, మునిసిపల్ ఉద్యోగుల ధిక్కార వైఖరి, పారిశుధ్య విషయాలపై చర్చ కొనసాగింది. వాటర్ వర్క్స్ ఎ.ఇ. పై దాడి చేయడాన్ని కొందరు కౌన్సిలర్లు అభ్యంతరం తెల్పగా, ఇండిపెండెంట్ రమణారెడ్డి వర్గ కౌన్సిలర్లు దీన్ని తప్పేమి కాదన్నారు. పనిచేయక పోవడంతోపాటు ప్రజలకు నిర్లక్ష్యంగా సమాధానం చెప్పే అధికారులకు దేహశుద్ధి చేయడం మినహా మరో మార్గం లేదన్నారు. చర్చలో మునిసిపల్ ఛైర్మన్ కోడూరు కల్పలత జోక్యం చేసుకొని అధికారులపై దాడులు చేస్తూ పోతే మునిసిపాలిటీలో పనిచేయను ఏ అధికారి ముందుకు రారన్నారు. పట్టణంలో మంచినీటి సమస్యను కాంగ్రెస్ కౌన్సిలర్లు ఎల్లసిరి గోపాల్‌రెడ్డి, గారా సరస్వతి, తెలుగుదేశం కౌన్సిలర్లు సురేంద్రనాథ్, స్వర్ణలత, హబీబు న్నీసా ప్రస్తావించారు. మంచినీటి విషయంలో మునిసిపల్ వాటర్ వర్క్స్ సిబ్బంది నిమ్మకు నీరెత్తినట్లుండడాన్ని తప్పు పట్టారు. ఛైర్మన్ కల్పలత సమాధానం చెబుతూ పట్టణంలో భూగర్భ జలాలు అడుగంటాయని అదనపు మోటర్లు కొనుగోలు చేసి.నీటి సమస్య పరిష్కారానికి ప్రయత్నం చేస్తానన్నారు. పట్టణంలో పారిశుధ్య పనులు చేస్తున్న సిబ్బందికి ఐదు నెలలుగా బిల్లులు

కొరవ 7వ పేజీలో


గాంధీ జయంతి సందర్భంగా నెల్లూరు పెద్దాస్పత్రిలో కుష్ఠురోగులకు పండ్లు పంచిపెడుతున్న జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ

# గబ్బుకావలికి వచ్చింది నిధులజబ్బు

నేతలు మారినా కావలి మునిసిపాలిటీ తలరాత మాత్రం మారడం లేదు. వ్యాపార కూడలి ప్రాంతమైన కావలి మునిసిపాలిటీలో జన్మభూమి పథకం ప్రారంభమైన మొదట్లో రికార్డు స్థాయిలో వంద సిమెంటు రోడ్లు నిర్మించారు. సిమెంటు రోడ్ల పుణ్యమా అని టౌన్ అందంగా కనపడకపోగా చెత్త దిబ్బలుగా దర్శనమిస్తాయి. చెత్తమయమైన రోడ్లపై నడవాలంటేనే నరకప్రాయంగా వుంది. దీనికి తోడు పిల్ల తరబడి మురికి కాల్వలను శుభ్రపరచక పోవడం వల్ల అవి పొంగి సిమెంటు రోడ్లపై చిన్న సెలయేళ్లవలె ప్రవహిస్తుంటాయి. ఏ వీధిలో చూసినా ఇదే పరిస్థితి నెలకొని వుంటుంది. దీనికి తోడు కావలిలో పందుల సంచారం జాస్తి. పెరుకపోయి వున్న చెత్తా చెదారాన్ని అవి మరింత విస్తారం చేస్తున్నాయి. దోమల బెడద కూడా చెప్పనలవి కాకుండా ఉంది. అవి కుట్టడం వల్ల రకరకాల రోగాలు సోకి కావలివాసులు తల్లడిల్లి పోతుంటారు. వీధుల్లో లైట్లు వెలగక పోవడం వల్ల ప్రతినిత్యం ఏదో ఒక వీధిలో దొంగతనం జరుగుతూనే వుంటుంది. మంచినీటి కొళాయిల్లో నీరు సరిగ్గారాదు. కోట్లు ఖర్చుపెట్టి నిర్మించిన కాంప్రహెన్సివ్ వాటర్ స్కీమ్ పనికిరాకుండా పోయి నీటికోసం కావలీయులు నిత్యం ఇబ్బందులు పడేలా చేసింది. మునిసిపల్ సిబ్బందికి ఆరు నెలలుగా జీతాలులేవు. అందువల్ల వారు సరిగ్గా విధులకు హాజరు కావడం లేదు. 3కోట్ల లోటు బడ్జెట్

## నేతలు మారినా మారని తలరాత

వల్ల మునిసిపాలిటీలో ఏ ఒక్క అభివృద్ధి పని జరగడం లేదు. ఈ విషయాన్ని మునిసిపల్ ఛైర్మన్ గ్రంధియానాది శెట్టి సైతం గత మునిసిపల్ సమావేశంలో అంగీకరించారు. కౌన్సిలర్లు సైతం ఉత్త భద్రయ్యలుగా మిగిలారు. సంక్షోభంలో కూరుకపోయి వున్న మునిసిపాలిటీ తలరాత మార్చే వాడికోసం ఎదురు చూస్తుంది.

## గూడూరులో మంచినీటి సమస్య

గూడూరులో ప్రజలు మంచినీటికై కటకటలాడుతున్నారు. ప్రధాన మంచినీటి వనరైన మునిసిపల్ కొళాయిల నుంచి ఉదయం 15 నిమిషాలు, సాయంత్రం 15 నిమిషాలు మాత్రమే నీళ్లు వస్తున్నాయి. ఇవి ప్రజల అవసరాలకు ఏ మాత్రం సరిపోవడం లేదు. ఇళ్లలోని బావులు, వీధుల్లోని బోర్లలో సైతం నీళ్లు అడుగంటాయి. సమస్య తీవ్రం కావడంతో పరిష్కార మార్గం కోసం మునిసిపల్ ఛైర్మన్ కోడూరు కల్పలత 2వతేది వాటర్ వర్క్స్‌లోని బోర్లు, బావులన్నింటిని తిరిగి పరిశీలించారు. వర్షాలు పడక పోవడం వల్ల భూగర్భ నీటి మట్టం బాగా తగ్గిపోయిందని మునిసిపల్ ఇంజనీర్లు ఆమెకు చెప్పారు. కండలేరు నీటిని ఏదో విధంగా గూడూరు వరకు రప్పిస్తే తప్పప్రజల దాహార్తి తీరదు. కాని ఈ సమస్యను ఎమ్మెల్యే దుర్గాప్రసాద్ అంత సీరియస్‌గా పట్టించుకోవడం లేదు.

# బొల్లినేనిని నిలేసిన సిపిఎం

ఆత్మకూరు ఎమ్మెల్యే బొల్లినేని కృష్ణయ్య ఇక్కడకు రావడాన్ని తగ్గించుకోవడం వల్ల పలువురి విమర్శలు ఎదుర్కోవాల్సి వస్తున్నది. 1తేది ఆత్మకూరు ఇన్‌స్పెక్షన్ బంగ్లాలో కాంగ్రెస్ కార్యకర్తల సమావేశం ముగిసిన వెంటనే సిపిఎం కార్యకర్తలు అక్కడకు వచ్చి ఎమ్మెల్యే క్రిష్ణయ్యను నానా మాటలన్నారు. ప్రజలకు అందుబాటులో వుండలేని వ్యక్తివి ఎందుకు ఎన్నికల్లో నిలబడ్డావు? ఏదైన సమస్య ఏర్పడితే నిన్నెక్కడ సంప్రదించాలని దుర్భాషలాడినా ఎమ్మెల్యే అన్నింటికి మౌనమే తన సమాధానమన్నట్లు గమ్మునుండి పోయారు. మండల కాంగ్రెస్ అధ్యక్షుడు కృష్ణమనాయుడు అవమానాన్ని సహించలేక సరిగె పంచె ఎగ్గట్టి సిపిఎం కార్యకర్తలతో వాదనకు దిగారు. ఎమ్మెల్యే అంటే లోకువ అయ్యాడా? ప్రభుత్వాను పత్రిక పోతే బిజెపి కార్యకర్తలు అటకాయించారు. బంద్ రోజు మీరు అటకాయించారు. ఎమ్మెల్యే నిత్యం ఆత్మకూరులో వుండిపోవాల్సిందేనా అని స్వరం తీవ్రం చేసినా, సిపిఎం కార్యకర్తలు ఏ మాత్రం వెనక్కు తగ్గలేదు. ఇంత గొడవ జరిగినా ప్రక్కనే వున్న మాజీ ఎమ్మెల్యే డాక్టర్ సుందరరామిరెడ్డి ఈ విషయంలో కలుగజేసుకొని సర్ది చెప్పే ప్రయత్నం చేయక పోవడం విమర్శకు దారితీసింది.

## జిల్లావార్తలు

### గూడూరులో అక్షర సంక్రాంతి

గూడూరు టౌన్‌లో అక్టోబర్ 2తేది

కొరవ 8వ పేజీలో

# ఆత్మకూరును సస్యశ్యామలం చేస్తా

సోమశిల ప్రాజెక్టుకు సంబంధించిన ఉత్తర, దక్షిణ కాల్వలను పూర్తి చేయించి ఆత్మకూరు నియోజక వర్గాన్ని సస్యశ్యామలం చేస్తానని ఆత్మకూరు ఎమ్మెల్యే బొల్లినేని కృష్ణయ్య హామీ ఇచ్చారు. 1తేది ఆత్మకూరు పబ్లిక్ వర్క్స్ ఇన్స్‌పెక్షన్ బంగళాలో ఏర్పాటైన మండల కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో మాట్లాడారు. ఆత్మకూరు నియోజక వర్గంలో సోమశిల ప్రాజెక్ట్ వుంది. కాని ప్రాజెక్ట్ నీటిని నియోజకవర్గ ప్రజలు వాడుకొనే అవకాశాలు లేవు. డెల్టాకు మాత్రమే ఈ నీళ్లు ఉపయోగపడుతున్నాయి. అసెంబ్లీలో ఈ విషయాన్ని ప్రస్తావించాను. ప్రాజెక్టుకు ఈ యేడాది బడ్జెట్‌లో 30కోట్లు కేటాయించారు. ఇందులో నగం సిబ్బంది

## బొల్లినేని హామీ

జీతభత్యాలకే సరిపోతుంది. 2003 నాటికి సోమశిల పూర్తి సామర్థ్యం 78 టిఎంసి నీళ్లు నింపుతామని భారీ నీటిపారుదల శాఖా మంత్రి మండవ వెంకటేశ్వరరావు హామీ ఇచ్చారు. ప్రభుత్వంతో పోరాడైనా ఒక్క యేడాదిలోగా ఉత్తర, దక్షిణ కాల్వలను పూర్తి చేయిస్తానన్నారు. నేను కనపడడం లేదంటున్నారు. అందుకే ప్రతి నాలుగు నెలలకొకసారి మండల కార్యకర్తల సమావేశం ఏర్పాటుచేసి, ఆ సమావేశాల్లోనే కార్యకర్తల సమస్యలు పరిష్కరిస్తానన్నారు. సమావేశంలో మాజీ ఎమ్మెల్యే డాక్టర్ సుందరరామిరెడ్డి, మండల కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు సి.హెచ్. కృష్ణమనాయుడు, ఇప్పగుంట ఓబుల్‌రెడ్డి, డాక్టర్ రవీంద్రనాథ్‌రెడ్డి, డాక్టర్ ఆది శేషయ్య పాల్గొన్నారు.

# చెన్నపల్లిపాళెంలో రౌడీరాజ్యం

కోటపల్లిగూడూరు మండలం చెన్నపల్లిపాళెం గ్రామంలో రౌడీరాజ్యం కొనసాగుతుంది. రౌడీల నుంచి గ్రామస్తులు చాలా కాలం నుంచి బాధలు పడుతున్నా, చెప్పుకోవడానికి భయపడి బాధను దిగమ్రింగు కొంటున్నారు. రౌడీలు,వ్యాపారస్తులు, ఉద్యోగులు,

## అడ్డుకొనే వారేలేరు

రైతులు, ప్రయాణీకులను వేధించడం, బెదరించడంతోపాటు పోలీసు ప్రమేయం లేకుండా గ్రామంలో తీర్పులు చెప్పి జుల్మానాలు వేసే స్థాయికి ఎదిగి పోయారు. స్కూళ్లకు పోయే ఆడపిల్లలను, పనిమీద బయటకు వెళ్లే గృహిణులను టీజింగ్ చేస్తున్నారు. ఇటీవల ఒక ఉద్యోగి కుటుంబంలో వివాహితను ఈ ఘాతకులు అత్యాచారం చేస్తే కుటుంబ ప్రతిష్ట కోసం విషయాన్ని బయటకు చెప్పుకోలేక వాళ్లు ఊరు విడిచి పోయారు. మద్యం షాపుల యజమానులు ఈ రౌడీలను పెంచి పోషిస్తున్నారు. గ్రామంలో పెద్దలు కూడా తమ అవసరాలకు వీరిని వాడు కొంటుండడంతో వీరు పెట్రేగి పోతున్నారు. కోడూరు బీచ్ అభివృద్ధికి చేరువవుతున్న ప్రస్తుత తరుణంలో చెన్నపల్లిపాళెంలో రౌడీలు రెచ్చిపోవడాన్ని పోలీసులు అరికట్ట లేకపోతే అంతకన్నా అవమానం మరొకటి లేదు. రూరల్ సిఐ గారు అమాయకులపై చూపే మీ లాఠీ ప్రతాపం ఈ రౌడీలపై చూపండిసార్! ప్రజలు సంతోషిస్తారు.

## సైదాపురంలో కానరాని అభివృద్ధి

నాయకులకు కొదవలేని సైదాపురం మండలం అభివృద్ధి విషయంలో

కొరవ 7వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

[illegible]

## మునిసిపల్ కో ఆప్షన్ ఎన్నిక

నెల్లూరు మున్సిపల్ కో ఆప్షన్ ఎన్నికల్లో మూడు స్థానాలను కాంగ్రెస్ గెలుచుకొని విజయ ఢంకా మోగించింది. అజాగళ స్తనాల వంటి ఈ పదవులకు రమేష్‌రెడ్డి నానా హంగామా చేసి లేని పోని ప్రాధాన్యత ఆపాదించారు. చివరకు పోటీలో నిలవలేక అభాసుపాలయ్యారు. ఓటమి కారణంగా సంభవించిన అప్రతిష్టను నేర్పుగా మంత్రి ఆదాలపైకి నెట్టాలని రమేష్‌రెడ్డి ప్రయత్నం చేస్తున్నారు. మున్సిపల్ ఛైర్‌పర్సన్ పదవిలో ఉండేది స్వయానా ఆయన భార్య అనూరాధమ్మే. మున్సిపల్ వార్డు కమిటీల్లో గానీ, కో ఆప్షన్ సభ్యుల ఎన్నికలోగానీ, కమిటీల ఎంపికలో గానీ, గెలుపైనా, ఓటమి అయినా ఆమె ఖాతాలో జమకావాల్సిందే. అటువంటప్పుడు కో ఆప్షన్ ఎన్నికల్లో ఓటమికి తమ బాధ్యత లేదని చెప్పుకోవడం మూర్ఖత్వమే అవుతుంది. సాఫీగా జరగాల్సిన కో ఆప్షన్ ఎన్నికలకు మొదటి అడ్డు చక్రం వేసింది రమేష్‌రెడ్డే. జూలై నెల 21వ తేదిన మొదటి దఫా కో ఆప్షన్ ఎన్నికలకు కౌన్సిల్ సమావేశం అయినప్పుడు, తన భార్య అనూరాధతో సహా టిడిపి కౌన్సిలర్లను అడ్డుకొని కోరం లేకుండా చేసి వాయిదా వేయించారు. ఆనాటికి ఇండిపెండెంట్ సభ్యుడు పిండిసురేష్ ఓటుతో సహా తెలుగుదేశంకు 25 మంది కౌన్సిలర్లు ఉన్నా, సమావేశం నిర్వహించి, తమ పార్టీ సభ్యులను కూడా గెలిపించుకోలేని అసమర్థతలో ఉండిపోయారు. చేతికి వచ్చిన అవకాశాన్ని చేజార్చుకున్నారు. నాలుగు కో ఆప్షన్ స్థానాలను, నాలుగు పార్టీలు సమంగా పంచుకోవాలన్న పెద్ద మనుషుల ఒప్పందానికి ఆనాడు గండి కొట్టారు. మొదటి సమావేశంలోనే దీనికి కట్టుబడి ఉంటే, తెలుగుదేశం, బిజెపిలకు ఒక్కో స్థానమైనా దక్కేది. ఇప్పుడు అదీ లేకుండా, పరాభవమే ప్రాప్తమయ్యింది. ఆనం వర్గీయుడు వివేకాకు రామభక్తహనుమాన్ లాంటి దాట్ల నరసింహారావును కో ఆప్షన్ ద్వారా మళ్లీ కౌన్సిల్‌లోకి అడుగు పెట్టనీయ కూడదన్న పంతంతోనే రమేష్‌రెడ్డి తమ పార్టీకి, బిజెపికి కో ఆప్షన్ అవకాశాలను మంట గలిపేశాడు. మొదటి కో ఆప్షన్ ఎన్నిక కోరం లేకుండా వాయిదా పడిన తదనంతర రాజకీయ పరిణామాల్లో పిండి సురేష్, వివేకాకు దగ్గరయ్యాడు. తెలుగు దేశం పార్టీలో తలాకీదారిగా జట్టు కట్టు కుంటున్న కౌన్సిలర్ల వైఖరితో విసుగెత్తి పుట్టింటికి చేరిపోయాడు. తన ఓటు కీలకమని తెలిసి, తెలుగుదేశం నేతలు తన ఉనికి గుర్తించకుండా పోవడం కూడా సురేష్‌కు బాధ కలిగించింది.

గత నెల 29న జరిగిన కో ఆప్షన్ ఎన్నికలో పిండి సురేష్‌ను మళ్లీ తన వైపుకు తిప్పుకునేందుకు రమేష్‌రెడ్డి విఫల ప్రయత్నం చేశారు. చివరగా కో ఆప్షన్ ఎన్నికను నిలిపివేయించాలని రహస్యంగా హైకోర్టును కూడా ఆశ్రయించారు. అయితే కోర్టు 'స్టే' ఉత్తర్వులు ఇవ్వకుండా, కమీషనర్‌ను వివరణ కోరింది. ఇది మున్సిపాలిటీకి అందేలోపుగానే, కో ఆప్షన్ ఎన్నిక కూడా జరిగిపోయింది. దాట్ల నరసింహారావును కో ఆప్షన్ పదవికి ఎంపిక చెయ్యాలన్న వివేకా పంతం, సురేష్ సహకారంతో నెగ్గింది. పనిలో పనిగా మరో రెండు స్థానాలకు, తమ పార్టీకి చెందిన సుబ్బలక్ష్మి, పసుపులేటి శ్రీనివాసులును ఎంపిక చేయించారు. కో ఆప్షన్ ఎన్నికకు ఒక రోజు ముందు శ్రీధరకృష్ణారెడ్డి రాయబారంతో పాత ఒప్పందానికి కట్టుబడి తెలుగుదేశం, బిజెపిలకు చెరొక కో ఆప్షన్ స్థానం ఇచ్చేందుకు వివేకా అంగీకరించారు. అయితే సిపిఎం మాత్రం ఇందుకు ససేమిరా అంగీకరించలేదు. మూడు స్థానాలు కాంగ్రెస్‌పార్టీ తీసుకుంటేనే తాము మద్దతిస్తామని ఖరా ఖండిగా చెప్పేసింది. దీంతో రాజీ ఒప్పందం అడుగునపడిపోయింది. ఎన్నిక అనివార్యమై కాంగ్రెస్ విజయం సాధించింది. కో ఆప్షన్ ఎన్నికలయిన వెంటనే రమేష్ రెడ్డి స్వయంగా పత్రికల వాళ్లకు ఫోన్‌చేసి, ఈ ఓటమితో నెల్లూరు మున్సిపాలిటీలో మంత్రి ఆదాల ప్రతిష్ట మంటగలిసిందని చెప్పడం కొసమెరుపు.

## దసరా మామూళ్ల వసూళ్లలో ఉద్యోగులు

నెలకు వేలు జీతం పొందుతున్న ప్రభుత్వ ఉద్యోగులు దసరా మామూళ్ల వసూలును మాత్రం మానలేదు. పోలీస్, ఎక్సైజ్, కమర్షియల్ టాక్స్, ఇన్‌కంటాక్స్, విజిలెన్స్, విద్యుత్, నెల్లూరు మునిసిపాలిటీలో అన్ని శాఖల ఉద్యోగులు దసరా మామూళ్ల కోసం జనం మీద పడ్డారు. దసరా మామూళ్ల వసూలు కోసం వివిధ ప్రభుత్వ కార్యాలయాల్లో కొందరు ఉద్యోగులు పోటీ పడి పాట పాడుకొన్నారు. ప్రజలపై పడి సంపాదించుకున్న వారు దసరాను జల్సాగా చేసుకొంటుంటే, సామాన్యులు బొరుగులు, పప్పు, బెల్లాలతో సరిపెట్టుకొంటున్నారు.

## కౌన్సిలర్ తెలివి

నెల్లూరు టౌన్ రైలు కట్ట అవతల వుండే తూర్పు ప్రాంతీయుల మంచినీటి అవసరాలు తీర్చే పథకం. నిర్మాణపు పనులకు హడ్కో సంస్థ 7కోట్ల 9లక్షల రూపాయలు ఇటీవల విడుదల చేసింది. ఈ పథకపు క్రెడిట్‌ను తాను దక్కించుకోవాలన్న తెలివైన ఎత్తుగడతో కౌన్సిలర్ కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి, ఈ పథకాన్ని వెంటనే మంజూరు చేయాలని టౌన్‌లో అక్కడక్కడ గోడలపై తన పేరిట బోర్డులు వ్రాయించాడు. మంజూరైన పథకాన్ని మళ్లీ మంజూరు చేయమని కోరడమేమిటి శీనయ్యా! తెలుగుదేశంలో చేరాక తెలివి మీరిపోయినట్లుందే!

## రాజేశ్వరమ్మ సన్నిధిలో జన సముద్రం

శరన్నవరాత్రి మహోత్సవాలను పురస్కరించుకొని దర్గామిట్టలోని రాజరాజేశ్వరమ్మ దేవాలయానికి భక్తులు ప్రతి దినం వేల సంఖ్యలో వెళ్తున్నారు. ఇక్కడ విద్యుత్ దీపాలతో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఆర్చ్‌లు భక్తులను వైభవంగా ఆకర్షిస్తున్నాయి. ప్రత్యేక పూజలు, ఆధ్యాత్మిక ఉపన్యాసాలు, సాంస్కృతిక కార్యక్రమాలు ఆలయానికి వెళ్లే భక్తులను కట్టిపడేస్తున్నాయి. ఉత్సవాలు చక్కగా జరిగేందుకు ట్రస్టీ, ఫెస్టివల్ కమిటీ సభ్యులు, ఆలయ సిబ్బంది బాగా కష్టించారు.

## నెల్లూరీయునికి రాష్ట్రపతి సేవాపతకం

గొల్లకందుకూరు వాసి, గుంటూరులో హోంగార్డ్ కెప్టెన్ కమాండర్‌గా పనిచేసి పదవీ విరమణ చేసిన హరనాథ్ సింగ్‌కు రాష్ట్రపతి పౌర రక్షణ సేవా పతకం లభించింది. ఈ పతకాన్ని ఇటీవల హైదరాబాద్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, హరనాథ్‌సింగ్‌కు అందించారు.

# ప్రాణప్రదం

మొదటి పేజీ తరువాయి

జ.రై.: అప్పుడు అధికారంలో వుండిన కాంగ్రెస్ వంటి పార్టీలను వదలి, జనసంఘంలో ఎందుకు చేరారు? సిద్ధాంతాల పట్ల ఆకర్షణా లేక సహవాసాల ప్రేరణా?

నాయుడు: నేను జనసంఘంలో ఎప్పుడూ సభ్యుణ్ని కాదు. విద్యార్థి పరిషత్‌లో మాత్రమే సభ్యత్వం తీసుకున్నాను. పరిషత్ ఆదర్శాలు, క్రమశిక్షణ, దేశభక్తి ప్రపూరిత ఉపన్యాసాలు, దేశ సంస్కృతి, చరిత్ర ఔన్నత్యం వంటి విషయాలు నన్ను ఎంతగానో ఆకర్షించాయి. జనసంఘంలో చేరకపోయినప్పటికీ ఆ పార్టీకి పనిచేసేవాడ్ని. బంగారు లక్ష్మణ్ నెల్లూరు నుంచి పోటీ చేసినప్పుడు రెండు నెలల పాటు కాలేజి మానేసి గోడల మీద పేర్లు వ్రాశాను. అన్నదాత మాధవరావు ఎన్నికల ప్రచారంలోనూ ఒక కార్యకర్తగా పాల్గొన్నాను.

జ.రై.: జనసంఘం లేదా బిజెపి అధికారంలోకి రావడం కల్ల అని జనం భావిస్తుండిన రోజులలో మీరు ఆ పార్టీకి అంకితం కావడం పట్ల స్నేహితులు కాని, కుటుంబ సభ్యులు కాని అభ్యంతరం పెట్టలేదా?

నాయుడు: స్వర్గీయ ఆనం వెంకటరెడ్డి గారు మొదట్లోనే నన్ను పిల్చి ఆ పార్టీలో ఎందుకు చేరావురా అని మందలించారు. ఇప్పుడు బ్రతికి వుంటే నేను మంత్రినైనందుకు ఆయన ఎంతగానో సంతోషించివుండేవారు. విద్యార్థి దశలో రాజకీయ కార్యకలాపాలు చేపట్టేటప్పుడు అధికారం, పదవులు వంటి వాటి ధ్యాస వుండేది కాదు. మా కుటుంబంలో మొదట కొంత భయం వుండేది. సంఘంలో చేరితే పెళ్లి చేసుకోడని ఎవరో చెప్తే విని, నేను సంఘంలో చేరుతున్నందుకు కలత చెందారు కూడా. కాని పార్టీలో, ప్రజలలో నాకు గుర్తింపు రావడం చూసి ఆ తర్వాత వారే సంతోషించారు.

జ.రై: రాజకీయాలలో పాల్గొనడం వేరు, రాజకీయాలకు అంకితం కావడం వేరు. మీరు రెండవ త్రోవ ఎంచుకున్నారు. మధ్యతరగతి ఆర్థిక నేపథ్యంలో నుంచి వచ్చిన మీరు భవిష్యత్తులో కుటుంబ పోషణ ప్రమాదమని భయపడలేదా?

నాయుడు: రాజకీయాలకు అంకితం కావాలని నేను అప్పట్లో అనుకోలేదు. లా చదివి, పెద్ద లాయర్‌గా పేరు తెచ్చుకోవాలనుకున్నాను. మా అమ్మ నా చిన్న తనంలోనే చనిపోయింది. ఆమె బ్రతికి వుండేటప్పుడు అంటుండేదట - నేను వకీలు అవుతానని. మా గ్రామంలో అప్పటి ప్రసిద్ధ న్యాయవాదులు అల్లాడి కుప్పుస్వామి, మామిడిపూడి వెంకట రంగయ్య వంటి వారికి పొలాలు వుండేవి. వారిని చూసి మా అమ్మ నేను కూడా అంత వాడిని కావాలని ఆశపడిందేమో పాపం. అందుకే నేను యూనివర్శిటీలో లా కోర్సులో చేరాను.

జ.రై: పూర్తి కాలం రాజకీయాలకు పరిమితం కావాలని ఎప్పుడు నిర్ణయం తీసుకున్నారు?

నాయుడు: విద్యార్థి పరిషత్ సభ్యుడిగా నేను చాలా రాష్ట్రాలలో తిరిగాను. ఆ ప్రయత్నాలలో రాజకీయవాదులతో పరిచయం ఏర్పడింది. యూనివర్శిటీలో చేరగానే జై ఆంధ్ర ఉద్యమం రావడం, నేను అందులో కీలకపాత్ర వహించడం అనుకోకుండా జరిగిపోయాయి. కొన్ని వేల మంది జనం పాల్గొన్న బహిరంగ సభలో ప్రసంగించే అదృష్టం కల్గింది అప్పుడే. ఆ ఉద్యమం వల్ల రాజకీయాలకు గల శక్తి, ప్రజలపై రాజకీయ ప్రాభవం బాగా అర్థమైనాయి. నా జీవితంలో రాజకీయపరమైన కీలక, నిర్దుష్ట మలుపు వచ్చింది అప్పుడే.

జ.రై: మీ జీవితంపై ప్రభావం చూపిన వ్యక్తు లెవరు?

నాయుడు: యూనివర్శిటీలో చదివేటప్పుడు జయప్రకాష్ నారాయణ్ గారిని పిల్చి సభ జరిపాను. దానితో ప్రభుత్వం నన్ను మీసా చట్టం క్రింద అరెస్టు చేసి జైలులో పెట్టింది. ఆ ఎమర్జెన్సీ రోజులలో జైలులో నాకు సర్దార్ గౌతులచ్చన్న, తెన్నేటి విశ్వనాథం, జూపూడి యజ్ఞనారాయణ, రామారావు వంటి వారితో సన్నిహితంగా మెలిగే అవకాశం కల్గింది. నా జీవితంలో ఎంతో అద్భుతమైన పరిచయాలివి. కొందరు నక్సలైట్లు కూడా నాతో స్నేహం కలిపారు. పలు రకాల రాజకీయ సిద్ధాంతాలు, అభిప్రాయాలు తెలుసుకుని, విశ్లేషించుకొనే అరుదైన అవకాశం నా జైలు జీవితం. పౌరహక్కుల ఆవశ్యకత, ప్రభుత్వంలోని వారి అక్రమాలు, పరిపాలనలోని లోపాలు, వాటిని సరిదిద్దడానికి యువకులు చేయవల్సిన త్యాగాలు, ప్రభుత్వ దుష్పరిపాలన వల్ల ప్రజల జీవితాలపై పడే విపరీత ప్రభావం వంటి వాటిపై జైలులోని పెద్దలు నాకు అవగాహన కల్గించారు. అప్పుడే నేను గట్టి నిర్ణయం తీసుకున్నాను - వుద్యోగాలు, సద్యోగాలు ప్రశ్న లేదు - తతిమా జీవితమంతా ప్రజలతోనే గడపాలని.

జ.రై.: ఎన్నేళ్లు గడిచినా అధికారానికి అమడ దూరంలో, ఎప్పటికీ ప్రతిపక్షంగా వుండబోయే బిజెపి పార్టీలో గడపవల్సి రావడం పట్ల ఎప్పుడైనా అసంతృప్తి కల్గిందా?

నాయుడు: లేదు. నిజానికి బిజెపి పార్టీ నాకు ఎంతో ఇచ్చింది. చిన్న వయస్సులోనే ఎమ్మెల్యే టికెట్ ఇచ్చి ఒంగోలులో పోటీకి నిల్పింది; ఎమ్మెల్యేగా గెల్పించింది; అసెంబ్లీలో ఫ్లోర్ లీడర్ను చేసింది; రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా, అధ్యక్షుడుగా వ్యవహరించే అవకాశం ఇచ్చింది; ఆ తర్వాత దేశ స్థాయిలో ఏడేళ్లపాటు జనరల్ సెక్రటరీ పదవి నిర్వహించాను; పార్టీ స్పోక్స్‌మాన్‌గా పనిచేశాను; పార్లమెంట్ బోర్డులో రాష్ట్ర వ్యవహారాలు చూసే కమిటీకి నన్ను కన్వీనర్ చేశారు వాజ్‌పాయి గారు; పార్టీని, ప్రభుత్వాన్ని సమన్వయం చేసే బాధ్యత కూడా నాకు అప్పచెప్పారు ప్రధానమంత్రి. ఇన్ని బాధ్యతలు, కీలక అవకాశాలు కల్పించిన పార్టీకి నేనెప్పుడూ రుణపడి వుంటాను. అందువల్లే నేను మొదట చెప్పింది - వ్యక్తిగతంగా నాకు మంత్రిత్వం కంటే పార్టీ పనులే సంతోషం కల్గిస్తాయని.

జ.రై.: జై ఆంధ్రా ఉద్యమంలో మీరు చురుకుగా పాల్గొన్నారు; ఒక నేతగా మీకు గుర్తింపు తెచ్చింది కూడా ఆ ఉద్యమమే. ఇప్పుడు కూడా మీకు ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలని కోరికవుందా. లేక అది తెలియక, ఆవేశంతో చేసిన వుద్యమం మాత్రమేనా?

నాయుడు: జై ఆంధ్రా వుద్యమం కేవలం రాజకీయపరమైంది. కొందరు రాజకీయ నేతలు తమ అవసరాల కోసం దాన్ని ప్రారంభించారు; అవసరం తీరగానే వుద్యమం నిలిపివేశారు. చిన్న వయస్సు కాబట్టి మాకు అది అర్థం కాలేదు. నేతలు మమ్మల్ని మోసం చేశారన్న సంగతి అర్థమయ్యేటప్పటికి అంతా అయిపోయింది; మేము నిస్సహాయులుగా వుండిపోయాము. వ్యక్తిగతంగా నాకు ఇప్పుడు ఆంధ్ర, తెలంగాణా అనే భేదం లేదు. రాష్ట్ర ప్రజలందరూ కలసి వుండవలెనన్నదే నా అభిలాష. అయితే పార్టీగా బిజెపి విధానం చిన్న రాష్ట్రాలు వుండాలన్నది. పరిపాలనాపర సౌలభ్యం, ఆర్థిక స్వయం ప్రతిపత్తి, భౌగోళిక అనుకూలతలు పరిగణనలోకి తీసుకుని రాష్ట్రాలను చిన్నవిగా ఏర్పాటు చేయాలని బిజెపి భావిస్తున్నది. పార్టీ విధానం ఏదో నా అభిప్రాయం కూడా అదే.

జ.రై: పాతికేళ్ల ప్రజా జీవితంలో ప్రజలకు వుపయోగపడే పని చేశాను అని సంతృప్తి కల్గించిన సందర్భం ఏది?

నాయుడు: రాజకీయాలలో నాకు సంతృప్తి కల్గించిన సంఘటన - ఎమ్మెల్యేగా అసెంబ్లీలో గ్రామీణ ప్రజా సమస్యలు గుర్తింపుకు తీసుకొనిరావడం. మరొక ప్రక్క రాష్ట్రంలో కాంగ్రెస్ పరిపాలనకు భరత వాక్యం పల్కడంలో నా వంతు పాత్ర కూడా వుందన్న సంతృప్తి వుంది నాకు. కాంగ్రెస్

తరువాయి 11వ పేజీలో

# రౌడీరాజ్యం

5వ పేజీ తరువాయి

నాయకులకు కొదవలేని సైదాపురం మండలం అభివృద్ధి విషయంలో మాత్రం అధఃపాతాళంలో వుంది. సైదాపురం మండలం సగం రాపూరు నియోజకవర్గంలో మిగతా సగం వెంకటగిరి నియోజకవర్గం పరిధిలోకి వస్తుంది. గతంలో ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి, యాచేంద్ర, జిల్లా పరిషత్ ఛైర్మన్ నెల్లూరు కౌసల్య ప్రాతినిధ్యం వహించినా సాధించిన అభివృద్ధి శూన్యం. మండలంలోని రోడ్లు దారుణ పరిస్థితుల్లో వున్నాయి. వెంకటగిరి నుంచి కలిచేడులోని తన మైన్‌కు కారులో వచ్చే రాజా తాను ఎమ్మెల్యేగా ఉన్నప్పుడు సైతం ఈ రోడ్డును బాగు చేయించలేక పోయారు. పంచాయతీ ఎన్నికల ప్రకటనలతో మళ్లీ నాయకులు ప్రజల ముందుకు వస్తుండడంతో సమస్యల మీద ప్రజలు నిలేస్తున్నారు. రాపూరు ఎమ్మెల్యే ఆనం రామనారాయణరెడ్డి మండలంలో కొన్ని

# పనిచేయకపోతే

5వ పేజీ తరువాయి

చెల్లించలేదని కొందరు కౌన్సిలర్లు ప్రస్తావించారు. పలు వార్డుల్లో వీధి దీపాలు వెలగడం లేదని కౌన్సిలర్ గిరి సురేంద్ర సభ దృష్టికి తీసుకొచ్చారు. ఉద్యోగులు మునిసిపల్ ఖజానా నుంచి 53వేలు డ్రా చేసుకొని తమ దగ్గర పెట్టుకోవడమేమిటని 3వార్డు కౌన్సిలర్ గాయం రమణయ్య నిలదీశారు. మునిసిపల్ కమీషనర్ సెలవుల్లో వెళ్తుండడం వల్ల అత్యవసర పనుల కోసం ఈ పని చేసినట్లు ఛైర్మన్, సభ్యులను సమాధాన పర్చారు. గూడూరు తూర్పు, పడమరలను కలుపుతూ రైల్వే శాఖ నిర్మించదలచిన పై ఓవర్ బ్రిడ్జి నిర్మాణం గూర్చి మునిసిపాలిటీకి కనీసపాటి సమాచారం తెలియజేయక పోవడం పట్ల కాంగ్రెస్ కౌన్సిలర్ ఎల్లసిరి గోపాలరెడ్డి అభ్యంతరం వ్యక్తం చేశారు. దోమల నిర్మూలనకు ఫాగింగ్ మిషన్‌కొనే ప్రతిపాదనకు కౌన్సిల్ ఆమోదం తెలిపింది. మునిసిపాలిటీలో 10 మంది మహిళా కౌన్సిలర్లు వున్నందున ప్రత్యేక మరుగుదొడ్డి ఏర్పాటుకు సభ్యులు అంగీకరించారు. సమావేశంలో గొడవలు జరుగుతాయని పోలీసులను కార్యాలయం వద్ద మోహరించడాన్ని పలువురు ఇండిపెండెంట్ కౌన్సిలర్లు సభలో తమ అభ్యంతరాన్ని వ్యక్తంజేశారు. ఇటువంటి నిర్ణయాల వల్ల కౌన్సిల్ ప్రతిష్ట దెబ్బతింటుందన్నారు.

# శిల్పకళా శోభితం - 'మల్లాం'సుబ్రహ్మణ్య వైభవం

నెల్లూరు జిల్లాలో అద్భుత 'శిల్ప కళా ప్రతిభకు పరాకాష్ట మల్లాం' దేవసేన వల్లి సమేత సుబ్రహ్మణ్యేశ్వర ఆలయం.

గూడూరుకు తూర్పు, దక్షిణ దిశల్లో 52 కి.మీ దూరంలో సముద్ర తీర ప్రాంతంలో కళల కాణాచిగా యాత్రికులను ఆకట్టుకొంటూ దర్శన మిస్తుంది 'మల్లాం' ఆలయం. మల్లాం పూర్వ నామం 'తిరువాన్నూరు' మరో పేరు 'తిరుగుడుమల్లాం'. ఆలయ నిర్మాణానికి పూర్వం ఈ గ్రామం పల్లవుల ఆధీనంలో వుండేది. పల్లవుల శాసనాల్లో 'తిరువాన్నూరు' పేర్కొనబడింది.

ఇక్కడి రాతిరథం నిర్మాణ విషయంలో ఇద్దరు శిల్పుల మధ్య వాస్తు సంబంధమైన అభిప్రాయభేదాలొచ్చాయి. అంచేత ఇద్దరూ ఉత్తర, దక్షిణ దిశల్లో రథం ముందు భాగాన్ని చెక్కారు. ఉత్తర దిశ శిల్పి దక్షిణం వైపున్న రథం ఇరుసుల్ని పీకి, గుర్రం ముంగాళ్ల నరికాడట! రథం తిరగబడి ఇది 'తిరుగుడు మల్లాం' అయ్యింది. మరో

**వాస్తుసంగతులు**
**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**

కథనం ప్రకారం సుబ్రహ్మణ్య స్వామికి కంచిలో ప్రేయసి వుండేది. అక్కడికి అతను వెళుతూంటే శివుడికి కోపం వచ్చి రథం 'సీలలు' పీకించి వేశాడు. రథం తిరగబడింది. అందువల్ల తిరుగుడు మల్లా అయ్యిందని మరో కథనం.

### ఖండిత హస్తాల సుబ్రహ్మణ్యుడు!

తారక, పద్మాసుర, మల్లాసుర, కొల్లాసుర, రాక్షస సంహారం తర్వాత ఇక్కడ సుబ్రహ్మణ్యుడు తపస్సు చేస్తుండగా చుట్టూ వెదురు పొదలు పెరిగాయి.

చాళుక్య రాజు పాండ్య భూపతి వెదురుల్ని నరికి పల్లకి చెయ్యమన్నాడు. వెదురు పొదల్లోని 'స్వామికి' గాయమయ్యింది. భూపతి అంధుడయ్యాడు. సైనికులు చూడగా సుబ్రహ్మణ్యుడు రెండు చేతులూ ఖండింపబడి వున్నాయి.

భూపతి పశ్చాత్తాపంతో ఆలయ నిర్మాణం పూర్తి చేసి తిరిగి చూపును పొందాడు. ఇలా కథనాలు చాలావున్నాయి. మొత్తానికి రథమూ, స్వామి హస్తాలు భగ్నం కావడానికి ముష్కరుల దాడులే కారణం.

### చోళుల చేతికి నెల్లూరు!

క్రీ.శ. 907 - 953 ప్రాంతాలలో పల్లవుల ఆధీనంలోని నెల్లూరును, మొదటి పరాంతక చోళుడు కంచి వరకూ ఆక్రమించాడు.

### ఆలయ నిర్మాణం

ఆలయం నిర్మాణం క్రీ.శ 13వ శతాబ్దిలో జరిగిందని చారిత్రక కథనం.

### శాసనాల పెన్నిధి

'మల్లాం' ఆలయంలోని శాసనాల్లో ఇరవై ఏడింటిని శాసనశోధకులు పరిష్కరించారు. ఇవన్నీ తమిళ గ్రంథ లిపి. శాసనాలు ఇందులో మూడవ రాజరాజ రాజ్య కాలానికి చెందినవి 11. మూడవ కులోత్తుంగుడికి చెందినవి 5 శాసనాలున్నాయి.

మూడవ కులోత్తుంగుడి కాలంలో క్రీ.శ. 1178 - 1216 మొదటి మనుమసిద్ధి తమ్ముడు నల్లసిద్ధి, ఆ తర్వాత అతని తమ్ముడు తమ్ముసిద్ధి, క్రీ.శ. 1204-08 ఈ ప్రాంతాన్ని పాలించినపుడు ఆలయ అభివృద్ధి జరిగింది. నెల్లూరు పాలకుడైన ఎర్రసిద్ధి 1905 -18, తిక్క -1 1219 - 1248 గండగోపాల (తిరుకాళత్తిదేవ) కాలంలో ఆలయ అభివృద్ధికి కొన్ని పనులు చేపట్టారు.

విజయ గండ గోపాలుడి (1250 -1285) శాసనం ఒకటి ఈ ఆలయంపై వుంది. ఆ తర్వాత అధునాతనమైన శాసనం క్రీ.శ. 1314 - 15కి చెందింది.

### ఆలయం

ఆలయానికి 'సువిశాల'మైన ప్రాంగణమూ, ప్రహరీ వున్నాయి. ఈ ఆలయంలో బలిపీఠం ధ్వజస్తంభం, మహా మండపం, ముఖమండపం, ప్రదక్షిణం, అంతరాళం గర్భగుడి వున్నాయి.

### శతస్తంభ మంటపం!

అద్భుత శిల్పకళా పాటవానికి ఈ మండపం ప్రతీక. ఉత్తర, దక్షిణ దిశల్లో రథచక్రాలను, గుర్రాలను మలిచారు. చోళవాస్తు ఇందులో ప్రతిఫలిస్తుంది.

### ఇతర విగ్రహాలు

విఘ్నేశ్వర, ఉమామహేశ్వర, నరసింహ, సదాశివ, యోగనారసింహ, గోవర్ధనధారి, వేణుగోపాల, లక్ష్మీ సమేత భూవరాహమూర్తి విగ్రహాలు సర్వాంగ సుందరంగా వున్నాయి. ఆలయ శిల్పాలలో శైవ శిల్పాల తోబాటు వైష్ణవ శిల్పాలు చోటు చేసుకోవడం మత సామరస్య ప్రతీకగా కనిపిస్తుంది.

### ఆలయంలో అవాస్తు

ఆలయ ప్రాకారంలో ఇంద్రస్థానంలోనూ, యమస్థానంలోనూ ప్రవేశ నిష్క్రమణ ద్వారాలున్నాయి. ఫలితంగా కుబేర స్థానం, మూతపడింది. ఆదాయ మార్గాలకు 'గండి' పడింది. దక్షిణ ద్వార సమీపంలోని రెండవ బావి, శాస్త్ర విరుద్ధమై జనాకర్షణను 'వికర్షణ'గా మార్చింది.

ఇంద్రస్థానంలోని గోపురం శిథిల స్థితి నుంచి తేరుకోకపోవడానికి ఇదొక కోణం.

ఉత్తర దిశలోని కాలభైరవ ఆలయం కళ్యాణమండపానికి పశ్చిమంగా వెలసి 'దిగ్భాగాన్ని' అవనతం చేసింది.

ఈశాన్యంలోని స్టోర్ రూం, నటరాజ ఆలయాలు 'దిశాస్థానాన్ని' నీచం చేశాయి. 'స్థల స్థితిని' భారం చేశాయి. అందువల్ల వైభవోపేతంగా వుండవలసిన ఆలయం 110 ఎకరాల మాన్యం వున్నా ఆ ఆదాయాన్ని ఉపయోగించుకోలేని స్థితిలో వుంది.

### ఆలయంలో సులక్షణ వాస్తు!

చాలా కాలం నిద్రాణంగా వున్న ఆలయం దేదీప్యమానంగా వెలగడానికి అనుకోని విధంగా దాతల ముందుకు వచ్చి ఉత్సవాల్ని అద్భుతంగా జరపడానికి ఆ మధ్య నైరుతిలో గణేశాల నిర్మాణం ముఖ్య కారణం.

'నిరుతి స్థానం' (రాక్షస) బలీయమై ఉత్తర, పశ్చిమ దోషాల్ని ఈ నిర్మాణం పరిహరించింది. పశ్చిమ దిశలోని కోమలేశ్వర, కామాక్షి ఆలయాలు, నందిమండపం దిశా స్థానాన్ని 'ఉపరితల భారస్థితి'ని కలిగించి దక్షిణదిశలోని 'బావి' దిశాస్థానాన్ని 'అవనతం' చేసినా ఈశాన్యంలోని 'బావి' 'దిశాస్థితిని' ఉచ్చం చేసి ఆలయం స్థితిని మారుస్తున్నది. ఫలితంగా ఒక్కో సంవత్సరం ఆలయ స్థితి ఒక్కో విధంగా వుండి పురోగతి చెందుతుంది.

అయినప్పటికీ ఉత్తర ద్వారాన్ని తెరవడం ప్రాకారానికి నాలుగు ద్వారాలూ, గోపురాలూ ఏర్పాటు చేయడం, దక్షిణంలోని 'కూపాన్ని' పూడ్చడం చేయాలి. ఈశాన్య భాగంలోని నిర్మాణాల్ని తొలగించివేయాలి. ఖాళీగా వున్న పశ్చిమ వాయువ్యాన్ని పశుశాలలుగానో, మరో మండపంగానో మలచాలి. ఇలా ఆలయ అవాస్తు దోషాల్ని పరిహరించగలిగితే ఆలయం పూర్వవైభవాన్ని తిరిగి పొందగలుగుతుంది.

ఏటా సెప్టెంబరు మాసంలో ఇక్కడ బ్రహ్మోత్సవాలు మహావైభవంగా జరుగుతాయి. *

## జిల్లావార్తలు

5వ పేజీ కొరవ

గాంధీ జయంతి తోపాటు, అక్షర సంక్రాంతి కార్యక్రమం ఘనంగా జరిగాయి. గూడూరు బజారువీధిలోని గాంధీ బొమ్మకు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్, ఆర్డీఓ సుబ్రహ్మణ్యం రెడ్డి, మునిసిపల్ ఛైర్మన్ కోడూరు కల్పలత పుష్పమాలలు వేసి శ్రద్ధాంజలి ఘటించారు. గాంధీ బొమ్మ సాక్షిగా లయన్స్ క్లబ్ ఇక్కడ అక్షర సంక్రాంతి కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది. ఈ సందర్భంగా నిరక్షరాస్యులైన మహిళలకు పలకలు పంపిణీ చేశారు. ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్‌రావు మాట్లాడుతూ మురికి వాడల్లోనూ, గ్రామీణ ప్రాంతాల్లోనూ నిరక్షరాస్యత కారణంగా అనారోగ్యం ప్రబలు తుందన్నారు. అనంతరం గూడూరు సబ్ జైలులో అక్షర సంక్రాంతి కార్యక్రమాన్ని ఎమ్మెల్యే ప్రారంభించారు. జైలు గదులన్నింటిలో ఫ్యాన్ల ఏర్పాటుకు కృషి చేస్తామన్నారు. గతంలో బిజెపి పార్టీ వారు 10 ఫ్యాన్లు ఇస్తే జైలు సిబ్బంది ఇప్పటి వరకు వాటిని బిగించలేదని ఖైదీలు, ఎమ్మెల్యేకు ఫిర్యాదు చేశారు. కోడూరు శ్రీనివాసులు రెడ్డి జైలులోని ఖైదీలకు బ్లాక్ అండ్ వైట్ టివిని ఏర్పాటు చేస్తానని హామీ ఇచ్చారు. ఛైర్మన్ కల్పలత ఖైదీలకు మిఠాయిలు పంచారు. గాంధీ జయంతిని పురస్కరించుకొని గూడూరు పెద్దాస్పత్రిలోని రోగులకు గాంధేయవాది ఎన్. సుబ్బారెడ్డి పండ్లు, పాలు పంపిణీ చేశారు.



కాంగ్రెస్ పార్టీ మండల కార్యకర్తల సమావేశంలో మాట్లాడుతున్న ఆత్మకూరు ఎమ్మెల్యే బొల్లినేని కృష్ణయ్య. ప్రక్కన డాక్టర్ సుందర రామిరెడ్డి, సి.హెచ్. కృష్ణమునాయుడు

### కల్లుగీత కార్మిక సంఘం

ది గూడూరు గ్రూపు కల్లుగీత కార్మిక సహకార సంఘం ఎన్నిక 1తేది గూడూరు ప్రొహిబిషన్ అండ్ ఎక్సైజ్ సిఐ శ్రీనివాసాచారి పర్యవేక్షణలో జరిగింది. సంఘ అధ్యక్షునిగా జానా శ్రీనివాసులు గౌడ్, కార్యదర్శిగా అన్నం సుబ్బయ్యగౌడ్, డైరక్టర్లుగా రామలింగయ్య, శంకరయ్య, చిరంజీవి ఎన్నికయ్యారు. గతంలో ఎన్నడూ ఈ ఎన్నిక ప్రశాంతంగా జరిగిన చరిత్ర లేదు. బుచ్చి - స్పెషలాఫీసరుగా డిఇఓ

బుచ్చిరెడ్డిపాళెం స్పెషల్ ఆఫీసర్‌గా జిల్లా విద్యాశాఖాధికారి జయచంద్ర కుమార్ బుధవారం బాధ్యతలు స్వీకరించారు. ప్రస్తుతం అమలులో వున్న ఒయస్‌డి, నోడల్ వ్యవస్థ రద్దు కావడంతో ఈ నియామకం జరిగింది. గతంలో పనిచేసిన నోడల్, ఓయస్‌డి అధికారులు మొక్కుబడిగా సమావేశాలు నిర్వహించి, ప్రజల సమస్యలను అసలు పట్టించుకొనేవారు కాదు. మరి డిఇఓ ఏ విధంగా పని చేస్తారో వేచి చూడాలి.

### నీటి సంఘాధ్యక్షునిగా గోపాల్‌నాయుడు

జాఫర్‌సాహెబ్ కెనాల్ డిస్ట్రిబ్యూటరీ సంఘ అధ్యక్షునిగా సౌత్‌ఆములూరుకు చెందిన మద్దిన గోపాల్‌నాయుడు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. గతంలో ఈ డిస్ట్రిబ్యూటరీ సంఘం అధ్యక్షునిగా దివంగత జక్కా రంగారెడ్డి పనిచేసివారు. మద్దిన గోపాల్‌నాయుడు గతంలో సర్పంచ్‌గా, ఎమ్పీటిసి సభ్యునిగా గుర్తింపు తెచ్చుకొన్నారు. సర్వేపల్లి శాసన సభ్యుడు చంద్రమోహన్‌రెడ్డికి గోపాల్ నాయుడు నమ్మినబంటు. సౌత్‌ఆములూరు గ్రామస్థులకు వద్దంటే పదవులొస్తున్నాయి. జిల్లా పాలడైరీ ఛైర్మన్, నెల్లూరు తెలుగుదేశం పార్టీ ఇన్‌ఛార్జ్ గోపాలకృష్ణ చౌదరి ఈ గ్రామ వాసే.

### సమస్యల పరిష్కారానికే ప్రజాదర్బార్

ఎప్పటికప్పుడు ప్రజల సమస్యలను పరిష్కరించడానికి ప్రజాదర్బార్, డైల్ యువర్ కలెక్టర్ వంటి కార్యక్రమాలు ప్రవేశపెట్టినట్లు జిల్లా కలెక్టర్ ప్రవీణ్ కుమార్ చెప్పారు. 24లక్షలు వెచ్చించి కొడవలూరులో నిర్మించిన మండల ప్రజాపరిషత్ కార్యాలయాన్ని కలెక్టర్ ప్రారంభించి మాట్లాడారు. ఎంతోకాలంగా అపరిష్కృతంగా మిగిలివున్న చిన్న చిన్న ప్రజా సమస్యలు పరిష్కరించేందుకు విశేషకృషి చేస్తాను. దీని కోసమే త్వరలో మండల స్థాయిలో సమావేశాలు నిర్వహించనున్నట్లు చెప్పారు. ప్రజల సమస్యల పట్ల అధికారులు శ్రద్ధవహించాలని ఆయన అధికారులకు సూచించారు. ఈ కార్యక్రమంలో కోవూరు ఎమ్మెల్యే ప్రసన్న కుమార్‌రెడ్డి కూడా పాల్గొన్నారు.

### చెన్నపల్లిపాళెంలో ఉచితవైద్య శిబిరం

లయన్స్ క్లబ్ ఆఫ్ నెల్లూరు చెన్నపల్లిపాళెంలో ఉచితవైద్య శిబిరాన్ని నిర్వహించింది. శిబిరాన్ని సిండికేట్ బ్యాంక్ రీజినల్ మేనేజర్ రఘురామారావు ప్రారంభించారు. శిబిరంలో 350 మందికి పరీక్షలు జరిపి ఉచితంగా మందులు పంచిపెట్టారు. శిబిరంలో డాక్టర్లు జి. జయచంద్ర, జి. ప్రభావతి, కె.సత్యనాథ్, ఆర్వీ సుబ్రహ్మణ్యం, బి. రవిశంకర్ పాల్గొన్నారు. లయన్స్ క్లబ్ అధ్యక్షుడు ఇన్నమూరి ఉదయభాస్కర్, కార్యదర్శి ఎవిఆర్. మోహన్‌రావు, కోశాధికారి ఎన్.వి. ప్రసాద్, క్యాంపు ఛైర్మన్ కృష్ణమూర్తి, లయన్స్ మాజీ గవర్నర్ వై. శ్రీనివాసరావు, శిబిరానికి సహకరించిన సిండికేటు బ్యాంక్ కోడూరు బ్రాంచి మేనేజర్ కె. గోపాలరావు పాల్గొన్నారు. *

### పెరగడమేకాని - తరగడం లేదా!

*టి. కృష్ణమాచారి*

వడి వడిగా పెరిగే
  ధరల వరవడికి
ఉరవడి కొరవడి
  అలజడి రేగింది ఆత్మలో
కరెంటు షాకు నుంచి
  ఇంకా తేరుకోలేక పోతుంటే
గ్యాసు రేసుగుర్రంలా
  దూసుకు పోయింది
పెట్రోలు కంట్రోలు దాటి
  పెనుబండలా నెత్తినబడింది
ఆర్టీసి ఛార్జీలు
  అందలం ఎక్కాయి
ఇంటి పన్ను రెట్టింపై
  ఇరకాటంలో సంకట పెట్టింది
ఇది ప్రజారాజ్యమా!
  ధరల రాజ్యమా!
ప్రజారంజక ప్రభుత్వమా
  ప్రజాభంజక ప్రభుత్వమా
ప్రజలచే ఎన్నుకోబడి
  పన్ను పోట్లతో వెన్నుపోట్లు పొడిచే
ప్రభుత్వాధి నేతలే తెల్పాలి మరి!

# నేత్రదానం చేసిన మీనా!

మరణానంతరం తన రెండుకళ్లను దానం చెయ్యాలని నిర్ణయించుకొంది మీనా. సెప్టెంబర్ 16వతేది తన పుట్టిన రోజును పురస్కరించుకొని, తన తల్లి తండ్రులతో కలసి మద్రాస్‌లోని శంకర్ నేత్రాలయకు వెళ్లి దీనికి సంబంధించిన




పత్రాలు పూర్తి చేసి ఇచ్చింది. అనంతరం పత్రికల వారితో మాట్లాడుతూ చిరంజీవి, కమల్‌హాసన్, రజనీకాంత్, పార్తీపన్ వంటి నటులెందరో తమ నేత్రాలను దానం చేయడానికి నిర్ణయించుకొన్నారు. నేను కూడా నా కళ్లను దానం చేయాలని రెండేళ్లుగా అనుకొంటూ వస్తున్నాను. ఈ పుట్టిన రోజుకు ప్రకటించే అవకాశం కల్గింది. నేను ఎన్నో గుప్తదానాలు చేసాను ఏదీ బయటకు చెప్పలేదు. ఈ నేత్రదాన విషయాన్ని ఎందుకు ప్రకటిస్తున్నానంటే నాలాగే ఇతర నటులు కాని, అభిమానులు కాని ఈ మంచి కార్యానికి పూనుకొంటారని ప్రకటిస్తున్నానంది.

## కొత్త హీరోయిన్లు

పలువురు కొత్త హీరోయిన్లు తెలుగు వెండి తెరపై తమ అదృష్టాన్ని పరీక్షించుకోనున్నారు. బెంగాల్‌కు చెందిన ప్రియాంక సాయిమూవీస్ సంస్థ ఉపేంద్ర హీరోగా రూపొందిస్తున్న చిత్రంలో నటిస్తుంది. ముంబాయికి చెందిన షహీన్ వేణు హీరోగా నటిస్తున్న చిరునవ్వుతో

తరువాయి 11వ పేజీలో

# 'పాత్ర' కోసం ఈ 'మధుపాత్ర'

మధు భండార్కర్ దర్శకత్వంలో తయారవుతున్న 'చాందినీ బార్' చిత్రం లో టాబు హీరోయిన్‌గా నటిస్తుంది. ఈ చిత్రంలో హీరోయిన్ ఒక బార్‌లో పాటలు పాడేనర్తకి. ఈ పాత్రను టాబు పోషిస్తుంది. ఒక గ్రామీణ యువతి బొంబాయి వచ్చి బార్‌లో నర్తకిగా జీవితం ప్రారంభించి ఎటువంటి సమస్యలు ఎదుర్కొంది; వాటిని ఎలా

## టాబూ కొత్త వేషం

అధిగమించింది అనేది చిత్ర కథాంశం. అందువల్లే టాబూ బొంబాయిలో వున్న బీర్ బార్‌లన్నీ తిరిగి అక్కడ డాన్స్ చేసే గర్ల్స్ ఎలా ప్రవర్తిస్తారో తెలుసు కొంటుంది. సహజత్వంగా పాత్ర పోషిం చేందుకు ఇలా బార్లవెంట తిరుగు తున్నట్లు చెప్పింది.

## నా కుటుంబాన్ని చూసి గర్వపడతాను

తన కుటుంబాన్ని చూసి తాను గర్వపడతానని ప్రముఖ క్యారక్టర్ నటుడు విజయకుమార్ చెప్పారు. డబ్బున్న వాళ్లలో చాలా మంది తమకు ఆడపిల్ల లున్నందుకు ఎంతో కొంత బాధపడు తుంటారు. కానీ నేనసలు ఎప్పుడూ బాధపడలేదు. పైగా ఆడపిల్ల పుట్టిన ప్రతిసారీ మహాలక్ష్మి పుట్టిందని సంబర పడ్డాను. నా భార్య, కూతుళ్లు, కొడుకూ అందరూ నటులే. విజయకుమార్ కుటుంబం కళలకు నిలయం అని పరిశ్రమలో పెద్దలు ప్రశంసించినప్పుడల్లా నా భుజాలు కొంచెం గర్వంతోనూ, బోలెడు సంతోషంతోనూ పొంగుతుం టాయన్నా రాయన.



శ్రీసాయి మూవీస్ చిత్రంలో ప్రియాంక, ఉపేంద్ర

# అరవంలో జ్యోతిలక్ష్మి వీరంగం

ఒకప్పుడు తెలుగులో గొప్ప సెక్స్ డ్యాన్సర్‌గానే గాక హీరోయిన్ ఓరియం టెడ్ చిత్రాల్లో నటించిన జ్యోతిలక్ష్మి ప్రస్తుతం తమిళ చిత్రాల్లో విజృంభి స్తున్నది. వ్యాంపుల సాంప్రదాయం పోయి సినిమా కొత్తదారులు తొక్కినా, మళ్లీ వారిని తెరమీదకు తెచ్చి వారిని కొత్తకోణంలో చూపిస్తోంది తమిళ పరిశ్రమ. ప్రేక్షకుల్ని రంజింపజేసే విషయంలో జ్యోతిలక్ష్మి తమిళ ప్రేక్షకు లను ఆకట్టుకొంది. ఇటీవల విడుదలైన సేతు, ఎన్నమ్మా కణ్ణు తోపాటు మరో ఆరు చిత్రాల్లో జ్యోతిలక్ష్మి నటిస్తుంది. వయస్సు పైబడ్డా ఏ మాత్రం తగ్గని చురుకుదనంతో డాన్స్ చేస్తోంది. ఈమె కోసం ప్రత్యేకంగా ట్యూన్ చేసిన పాటలు ఆడియో టాప్‌టెన్‌లో ప్రస్తుతం నిలబడి వున్నాయి. తమిళుల టేస్ట్ అటువంటిది.

## కోట్లలో పారితోషికం

తన విలక్షణమైన సంగీతంతో ఉర్రూత లూగిస్తున్న సంగీత దర్శకుడు ఎ.ఆర్. రెహమాన్‌కు రికార్డు స్థాయిలో కోట్లలో పారితోషికం అందుకొన్నారు. తన నాటకాలతో ప్రపంచాన్ని ఉర్రూత లూగించిన రచయిత షేక్స్‌పియర్ జీవిత కథను లండన్‌లో నాటకంగా రూపొంది స్తున్నారు. షేక్స్‌పియర్ ట్రస్ట్‌వారు ఈ నాటకానికి సంగీతం సమకూర్చే

## ఛాన్సులపై ఛాన్సులు

బాధ్యతను ఎ.ఆర్. రెహమాన్‌కు అప్పగించారు. రెండు, మూడు నెలల లుగా లండన్‌లో వున్న రెహమాన్ షేక్స్‌పియర్ కాలం నాటి సంగీతం కోసం ఆయన నివశించిన ప్రాంతాలకు వెళ్లి పరిశీలించి వచ్చారు. లండన్‌లో ఈ సంవత్సరాంతంలోగా ఈ నాటకాన్ని ప్రదర్శిస్తారు. ఈ సంగీతానికిగాను ఇప్పటి వరకు భారతదేశ చలన చిత్ర రంగంలో ఎవరూ అందుకోలేనంత పారితోషికాన్ని రెహమాన్‌కు అంద జేస్తున్నట్లు మద్రాసులోని సినీ వర్గాలు కోడై కూస్తున్నాయి.

## పాత్రలు ఎంతోనేర్పాయి

మహాకవి కాళిదాసు చిత్రంలో కాళిదాసు పాత్ర పోషణ తన జీవితానికి మెరుగులు దిద్దిందని అక్కినేనిఅన్నారు. నాగమణి, సూరిబాబు గార్లు ఆ చిత్ర నిర్మాతలు. సంస్కృత కవి పాత్ర అక్కి నేని లాంటి చదువురానివాడు చేయగల డానని విమర్శకులన్నారు. పింగళి నాగేంద్రరావు ఆ చిత్రానికి కథ, మాటల రచయిత. కమలాకర కామేశ్వరరావు గారు డైరక్టర్. కథా చర్చల్లో పాల్గొనకున్న నిర్మాత నాగమణి సూచనమనసరించి డిస్కషన్లో పాల్గొని ఎన్నో విషయాలు తెలుసుకోగలిగాను. ఒక రకంగా కాళిదాసు, తెనాలి రామకృష్ణ, జయదేవ వంటి చిత్రాలు చేయడం వల్ల బాషాజ్ఞానం, వాక్ స్పష్టత అలవడ్డాయి. జన్మనిచ్చిన నా తల్లి దగ్గర్నుంచి ఈ రోజు నా చిత్రాన్ని డైరక్ట్ చేసే డైరక్టర్ వరకు నాకు స్ఫూర్తిగా నిలిచే ప్రతి వ్యక్తిని గురువుగా భావిస్తానన్నారాయన.

# ఛాయిస్ ఫస్ట్ - ఛాన్స్ నెక్స్ట్

చాలా బాగుంది చిత్రంలో హీరోయిన్‌గా నటించిన మాళవిక సెలెక్టివ్ చిత్రాల్లో మాత్రమే నటిస్తుంది. కారణ మడిగితే మంచి కథతో, మంచి కాంబినేషన్‌లో నిర్మాణమయ్యే చిత్రాల్లో మాత్రమే నటించాలని నిర్ణయం తీసుకొన్నట్లు చెప్పింది. ఎక్స్‌పోజింగ్ అంటే నాకు ఇష్టముండదు. మా నాన్నగారు మిలటరీలో వున్నందున నేను

## మాళవిక

క్రమశిక్షణతో కూడిన వాతావరణంలో పెరిగాను. ఎన్ని సినిమాలు చేశానని కాదు. చేసిన సినిమాల్లో నాకు ఎంత పేరొచ్చింది అనేదే ముఖ్యం. పాత సినిమాల్లో సావిత్రి, ఇప్పుడు సౌందర్య ఎక్స్‌పోజింగ్ చేసి ప్రేక్షకుల అభిమానం పొందారా? నా మటుకు నేను సినిమా అయినా వదులుకుంటాను కానీ, బట్టలు వదులు చేసి ఎక్స్‌పోజింగ్ మాత్రం చేయనంటుంది మాళవిక.

## అహంభావానికి దూరం

జీవితంలో ప్రతిదాన్ని తీపి అనుభవం కిందే మలుచుకొంటే చేదు అనుభవాలే వుండవని హీరో జగపతి బాబు చెప్పారు. దీనికి ఉదాహరణ చెబుతూ నా కెరీర్ ప్రారంభదశలో నాతో చిత్రం చేయడానికి ఒక నిర్మాత అడ్వా న్సు ఇచ్చి మళ్లీ వెనక్కు తీసుకున్నాడు. సక్సెస్‌లేని ఇతనితో సినిమా తీసి ఏం బావుకుందామని అని నిర్మాతకు అతని శ్రేయోభిలాషి చెప్పాడట. ఆ నిర్మాత తరపు నుంచి ఆలోచిస్తే అది నిజమేనని సరిపెట్టుకొన్నా. నాకు కోపం రాలేదు. అది అవమానమనీ అనిపించలేదు. సరికదా నాలో పట్టుదలను పెంచింది. కథల విషయంలో మరింత జాగ్రత్త తీసుకొని సక్సెస్ కోసం కృషి చేశాను. నిజానికి అవమానమన్నది మనలోని ఇగో వల్ల వస్తుంది. దీనికి దూరంగా వుంటే అవమానాలే రావన్నారు.

# 'అయోధ్య రామయ్య' అదరగొట్టేశాడు

జేబుదొంగలకు, ఇతర చిల్లర దొంగలకు చాలా బాధ కలిగింది. ఎందుకంటే ఒకరి జేబుకొట్టేసినా, ఒక చిన్న దొంగ తనం చేసినా, ఆ ఒక్క కుటుంబానికే నష్టం కలుగుతుంది. అదే నిధులు కాజేసే రాబందుల వల్ల, కోట్ల విలువ జేసే ప్రభుత్వ భూముల్ని దోచుకొనే ఘరానా నాయకుల వల్ల మొత్తం దేశానికి తీరని నష్టం వాటిల్లు తుంది. ఇంతకూ ఈ జేబు దొంగల, చిల్లర దొంగల ఆవేదన ఏమిటంటే తమ లాంటి ఛోటా దొంగల ఫోటోలను పోలీస్ స్టేషన్లలో, రైల్వే స్టేషన్లలో, బస్సు స్టేషన్లలో వీళ్లు దొంగలంటూ వేలాడగట్టు న్నారు. దేశాన్ని దోచుకునే దోపిడీ దొంగ లైన నాయకుల విగ్రహాలను గౌరవ ప్రదంగా నాలుగు వీధుల కూడళ్లలో ఆవిష్కరిస్తున్నారు. ఇది చాలా అన్యా యం. దేశ సంపదలన్నీ దోచే దోపిడీ దొంగలైన నాయకుల ఫోటోలు కూడా మా ఫోటోల్లాగే పోలీస్ స్టేషన్, రైల్వే స్టేషన్, బస్సు స్టేషన్‌లలో పెట్టాలని జేబుదొంగలు కోరుతున్నారు. వారి కోరికను ఒక పాటగా పాడి వినిపించారు "రైల్వే స్టేషన్లలో, పోలీస్ స్టేషన్లలో, బస్సు స్టేషన్లలో మా ఫోటోలు పెడతారు బాబూ; దొంగల ఫోటోలు పెడతారు బాబూ! దేశంలో సంపదలన్నీ దోచే దొంగలకేమో విగ్రహాలు చేసి, ఊరి మధ్య నిలబెడతారు బాబూ! ఇదెట్టా న్యాయం? ఇదెట్టా న్యాయం?" - జేబు దొంగలు ఈ పాట పాడుతూ న్యాయం చెయ్యమని గొంతెత్తి అరుస్తారు. ఆలోచిస్తే ఒక విధంగా వారి




కోరిక సమంజసమేననిపిస్తుంది.

ఈ పాట "అయోధ్య రామయ్య" చిత్రంలోనిది. దీన్ని గుండవరపు సుబ్బా రావు వ్రాశాడు. ఈ పాటే కాదు ఈ చిత్రం కూడా దేశ సంపదలను దోచుకునే నాయకుల మీద, ఇతర అన్యాయాలు, అక్రమాల మీద ధ్వజమెత్తుతుంది. కలుషిత రాజకీయాలపై దాడి చేస్తుంది. చంద్రమహేష్ ఈ చిత్రానికి దర్శకత్వం వహించాడు.

ఈ చిత్రంలో రెండు పోలీస్ పాత్రలున్నాయి. ఒకటి వృత్తి పట్ల నిబద్ధత గల సర్కిల్ ఇన్స్‌పెక్టర్ పాత్ర. నీతికి, నిజాయితీకి నిలువెత్తు రూపమిది. అన్యాయాలను, అక్రమాలను నిర్భయంగా ఎదిరించగల ధైర్య సాహసాలు కలిగింది. పోలీస్ డిపార్టుమెంటు విలువను నిల బెట్టాలనే పట్టుదల వుంది. హిందూ, ముస్లిం గలాటాలకు స్వార్థ రాజకీయ నాయకుల కుతంత్రాలే కారణమని, వాటిని అరికట్టేందుకు కృషి చేస్తుంది. చిన్న అంశాన్ని కూడా రాజకీయం చేసి స్వలాభానికి ఉపయోగించుకునే జవహర్ రెడ్డి (కోట శ్రీనివాసరావు) లాంటి కుటిల రాజకీయ నాయకులతో తరచూ తలప డుతూ వుండటంతో వారు ఉచ్చు బిగించటంతో, ఆ పాత్ర హతమై పోతుం ది. ఆ పాత్ర పేరు రామయ్య. త్రేతా యుగంలో అయోధ్యను రాముడు

తరువాయి 12వ పేజీలో

# వారఫలాలు

**7-10-2000తేది నుండి 13-10-2000తేది వరకు వృషభంలో వక్ర శని, గురువు; మిధునంలో రాహువు; సింహంలో కుజుడు; కన్యలో రవి; తులలో బుధ, శుక్రులు; ధనుస్సులో కేతువు; మకర, కుంభ, మీనాలలో చంద్రుడు.**



### మేషం

(అశ్వని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఆర్థిక పరిస్థితి బాగుండి ఆదాయం పెరుగుతుంది. శుభవార్తలు వింటారు. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. విలువైన వస్తువులు కొంటారు. ఉద్యోగులకు అధికారుల సహకారం బాగుంటుంది. సొంత పనులు, ప్రభుత్వ పనులు సవ్యంగా జరుపుకొంటారు. కుటుంబ చికాకులు తొలగిపోతాయి. పిల్లల విద్యావృద్ధి బాగుంటుంది. వృత్తి, వ్యాపార జీవనం గలవారికి లాభదాయంగా వుంటుంది. ఉద్యోగార్థులకు ఉద్యోగ లాభం ఉంటుంది. ఆదాయం, వైద్య సేవలు పొందుతారు.



### వృషభం

(కృత్తిక 2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

వృత్తి, వ్యాపార వర్గాల వారికి ఆదాయ వృద్ధి, ఆర్థికస్థితి బాగుంటుంది. అనుకున్న పనులు సవ్యంగా, సక్రమంగా జరుగుతాయి. అధికారుల సహకారం బాగుండి ఉద్యోగ నిర్వహణలో గుర్తింపు పొందుతారు. కొత్త పరిచయాలు, కుటుంబ సౌఖ్యం, రావలసిన బాకీలు కొంత వరకు పొందడం జరుగుతుంది. పలుకుబడి, గౌరవ ప్రతిష్ఠలు బాగుంటాయి. ఆర్థిక, కుటుంబ సమస్యలు పరిష్కారం కాగలవు.



### మిధునం

(మృగశిర 3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

స్వల్ప కుటుంబ సమస్యలుంటాయి. ఆరోగ్యం కూడా లోపిస్తుంది. సొంత పనులు అధికారిక పనులందు అనుకూలత, శుభవార్తలు వినడం, రావలసిన బాకీలు కొంత వసూలు కావడం జరుగుతుంది. స్థిరాస్తుల వ్యవహారాలు పరిష్కారం కాగలవు. సన్నిహితుల వల్ల అనుకోని సహాయం లభిస్తుంది. వ్యవసాయ, వ్యాపారాలలో అనవసర ఖర్చులు పైనబడగలవు.



### కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

వృత్తి, వ్యాపార రంగాలలో ఆర్థిక లాభాలు బాగుంటాయి. కొత్త పథకాలు ఆలోచనలతో ముందుకు సాగుతాయి. పలుకుబడి, పేరు ప్రఖ్యాతులు బాగుంటాయి. నూతనంగా ఉద్యోగావకాశాలు పొందుతారు. శుభవార్తలు వింటారు. వారం మధ్యలో కొద్దిగా ఆరోగ్య లోపం కలుగవచ్చును. సాంస్కృతిక, శాస్త్ర, వైద్య రంగాల వారికి అన్ని విధాల బాగుంటుంది. విద్యార్థులు మంచి కృషి చేస్తారు. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. నిర్మాణాది పనులు ప్రారంభిస్తారు.



### సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

మీ సమర్థత పరీక్షింపబడి విజయం సాధిస్తారు. మిత్రుల సహకారంతో పనులు జరుపుకుంటారు. ఉద్యోగావకాశాలు పొందుతారు. కొత్త పరిచయాలు, గత సమస్యల పరిష్కారం జరుగుతుంది. వారాంతంలో కొద్దిపాటి అనారోగ్య సమస్యలుంటాయి. అదనపు ఖర్చులు పైనబడగలవు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగుంటుంది. శాస్త్ర, సాంకేతిక రంగాల వారికి ఆహ్వానాలు. ఉద్యోగులకు అధికారుల అండదండలు బాగుంటాయి. కుటుంబ సౌఖ్యం, స్వల్ప ప్రయాణాలు, శుభకార్య నిర్ణయాలు జరుగుతాయి.



### కన్య

(ఉత్తర 2,3,4పాదాలు; హస్త; చిత్త 1,2పాదాలు)

వివాదాస్పద పనులు చక్కబడగలవు. వృత్తి, వ్యాపారాల పరంగా ఆదాయం బాగుంటుంది. నిర్మాణ పనులు ప్రారంభించడం, స్థిరాస్తుల క్రయవిక్రయాలు జరుపుతారు. సొంత ప్రయోజనాలకుగాను అదనంగా ఖర్చులు పెట్టగలరు. ఉద్యోగుల శ్రమకు గుర్తింపు ఉంటుంది.



## పంచాంగం

### ముహూర్తాలు

8తేది ఆదివారం ఉదయం 8.16 గంటలకు తులా లగ్నాన వ్యాపార, వివాహాలకు. 11తేది బుధవారం రాత్రి 12.30 గంటలకు కర్కాటక లగ్నాన గృహ ప్రవేశాలకు. 12తేది శుక్రవారం ఉదయం 7.50 గంటలకు తులా లగ్నాన వ్యాపార, వివాహాలకు సుముహూర్తాలున్నవి.

### చిత్తకార్తె

10తేది మంగళవారం చిత్త కార్తె ప్రారంభం.

అక్టోబర్ తిథులు

### ఆశ్వయిజ శుద్ధ

| | |
|---|---|
| తేది 7శని నవమి | ఉ7.00గం.వ |
| తేది 8 ఆది దశమి | ఉ9.00గం.వ |
| తేది 9 సోమ ఏకాదశి | ఉ 10.45 గం.వ |
| తేది 10 మంగళ ద్వాదశి | ప 10.20 |
| తేది 11బుధ త్రయోదశి | ప 1.30 గం.వ |
| తేది 12 బేస్త చతుర్దశి | ప 2.10 గం.వ |
| తేది 13 శుక్ర పూర్ణిమ | ప 2.20 గం.వ |

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.



### తుల

(చిత్త3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)



వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం పెరుగుతుంది. ఇతరులతో వ్యవహరించేటప్పుడు జాగ్రత్తపడాలి. పనులు సొంతవైనా, అధికారిక పనులైనా ఆటంకాలతో సాగుతాయి. ఆస్తి, అప్పు విషయాలను సామరస్యంగా పరిష్కరించుకొనండి. మిత్రులతో, బంధువులతో విభేదాలు కలుగవచ్చును.



### వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ రాశి వారికి ఆదాయం సరిగా ఉండదు. ఖర్చులు పెరిగి, అప్పు చేయవలసి రావచ్చును. నడుస్తున్న విభేదాలు, సమస్యలు, కొనసాగుతాయి. స్థిరాస్తులపై ఆదాయం మాత్రం ఉంటుంది. ముఖ్యమైన పనులు నిలబడిపోతాయి. మీ ప్రయత్నాలు, ఆలోచనలు తాత్కాలికంగా నిలబడగలవు. టెన్షన్ ఉంటుంది. శాస్త్ర, సాంకేతిక రంగాల వారికి ఉద్యోగావకాశాలు లభిస్తాయి. రాజకీయ, సాంస్కృతిక రంగాల వారికి ప్రోత్సాహం బాగుంటుంది.



### ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం బాగుంటుంది. ఆర్థికాభివృద్ధి ప్రయత్నాలు, పెట్టుబడులకు అవకాశాలు పొందుతారు. ఆరోగ్యం కొద్దిగ లోపిస్తుంది. సోదరులతో, బంధువులతో విభేదాలు రావచ్చును. అనుకున్న పనులు సమర్థవంతంగా జరుపుకుంటారు. ఉద్యోగార్థులకు మంచి అవకాశాలు లభిస్తాయి. అధికారుల సహకారంతో ఉద్యోగులు పనులు నెరవేరుస్తారు. సాహిత్య, రాజకీయ రంగాల వారికి సన్మానాలు, పలుకుబడి బాగుంటుంది. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. విద్యాప్రగతి బాగుంటుంది.



### మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

కుటుంబ వ్యవహారాలు, ఆస్తి వ్యవహారాలు పరిష్కారానికి వస్తాయి. వృత్తి, వ్యాపార రంగాలలో మంచి ఆదాయం కనపడుతుంది. పనులు బంధుమిత్రుల సహకారంతో నెరవేరుతాయి. ఆర్థిక రూపంలో సహాయం పొందుతారు. శాస్త్ర, సాంకేతిక రంగాలలోని వారికి ఉద్యోగలబ్ధి ఉంటుంది. శుభవార్తలు వింటారు. ఉద్యోగులకు మార్పులు, ప్రమోషన్ల వంటివానికి అవకాశాలు వస్తాయి.



### కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

ఈ రాశి వారికి ఆదాయవృద్ధి ఉండి ఆర్థికస్థితి మెరుగుపడుతుంది. అన్ని సమస్యలు పరిష్కారం కాగలవు. స్థిరాస్తుల క్రయవిక్రయాలు జరుగుతాయి. తండ్రివర్గ బంధువులకు అనారోగ్యం ఉంటుంది. కొత్త వస్తువులు కొనడం జరుగుతుంది.



### మీనం

(పూర్వాభాద్ర 4 పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఖర్చులు పెరిగి స్వల్పంగా అప్పులు చేయవలసి రావచ్చును. ఆదాయం సామాన్యంగా ఉంటుంది. సొంతపనులు, అధికారిక పనులు నిదానంగా సాగుతాయి. గౌరవ ప్రతిష్ఠలు, రాజకీయ పలుకుబడి బాగుంటుంది. ఉపయోగం, ప్రయోజనం పొందగల వార్తలు వింటారు. తగాదాలు, వ్యవహారాలలో శాంతం వహిస్తేనే సర్దుకుంటాయి. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్తగా ఉండాలి.

---

# జనవాణి

3వ పేజీ కొరవ

మంది మంత్రులకు సెక్యూరిటీ, పర్సనల్ అసిస్టెంట్లు, బంగళాలు, కార్లు ఇవన్నీ కావాలంటే ఖజానాపై ఎంత భారం పడుతుందో ఆలోచించాలి. రాజ్యాంగంలో మంత్రి వర్గ సభ్యులు ఎంతమంది వుండాలన్న విషయమై స్పష్టంగా నిర్దేశించక పోవడం వల్ల ప్రధానులు ఎవరికి తోచిన రీతిలో వారు వ్యవహరిస్తున్నారు. మంత్రి పదవి అనేది ప్రజలకు సేవ చేయడానికి కాక ఒక హోదాగా మారిపోయింది. నిజంగా ప్రజాసేవ పట్ల, ప్రజల సమస్యల పరిష్కారం పట్ల, చిత్తశుద్ధితో కృషి చేసేవారికి పదవులు అవసరం లేదు.

నెల్లూరు — ఎస్. సువర్చల

## చెరువుల పూడికతీత ఆనందకరం

రాష్ట్రంలో మూడువేల చెరువులలో పూడిక తీయాలని ఇటీవల ఇంజనీరింగ్ అధికారులు ప్రకటించారు. చెరువులు ఏళ్ల క్రితం నిర్మించినవి. ఎప్పుడో బ్రిటిష్ కాలం నాటి చెరువులే ఇప్పటికీ సక్రమ నిర్వహణకు నోచుకోక ఎందుకూ పనికిరాని దశలో వున్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో ప్రపంచ బ్యాంకు చెరువుల పూడిక తీతకు నిధులు ఇవ్వడం ముదావహం. ఈ పనులు ఎంత త్వరగా చేపడితే అంతమంచిది. చెరువు పూడిక పనుల్లో అక్రమాలు జరగకుండా ఈ పనులను అఖిల పక్ష రైతు కమిటీలకు ఇవ్వడం న్యాయం.

కోవూరు — కె.సత్యనారాయణ

## ఖాదీ షాపు స్థానే బ్రాందీ షాపు

నెల్లూరు టౌన్‌లో బ్రాందీ అమ్మకాలొచ్చిన కొత్తల్లో అంటే 35 సంవత్సరాల క్రితం గాంధీ బొమ్మ దగ్గర ఒక బ్రాందీ షాపు పెట్టారు. గాంధీ బొమ్మ దగ్గర బ్రాందీ అంగడని అప్పుడు విచిత్రంగా చెప్పుకొనేవారు. అదే విధంగా 50 సంవత్సరాలుగా ట్రంక్‌రోడ్ సెంటర్లో ఖాదీ భాండారు అని గుడ్డలంగడి వుండింది. మొన్నొక రోజు అటు వెళ్లి చూస్తే గుండె ఝల్లుమన్నది. ఖాదీ భాండార్ వున్నచోట ఒక బ్రాందీ షాపు వెలసివుంది. ఖాదీకి విలువలేని ఈ రోజుల్లో ఇక్కడ ఖాదీ వ్యాపారం జరగక ఎత్తివేసి ఉండవచ్చు. కాని అక్కడ బ్రాందీ వెలవడం మాత్రం మనసును బాధపెట్టింది.

నెల్లూరు — తూవిలి వనమాలి

## కుంటుపడిన ఐఎఎస్ వ్యవస్థ

సెప్టెంబర్ 8తేది సణుగుడు శీర్షికలో రాష్ట్రంలోని ఐఎఎస్ అధికార్ల పని తీరు గూర్చి చాలా బాగా వ్రాశారు. ఐఎఎస్ అధికారులు తాము దైవాంశ సంభూతులమని, పరిపాలనా దక్షులమనే భ్రమలో వున్నారు. కొందరు ఐఎఎస్ అధికారులకు నోటి దురుసు ఎక్కువ. సమావేశాల్లో క్రింది వుద్యోగులను 'బాస్టర్డ్' అని సంభోదించిన సంఘటనలు కూడా వున్నాయి. ఐఎఎస్ అధికారులు గతంలో నీతివర్తనులుగా వుండేవారు. ప్రస్తుతం వారు అవినీతి మార్గాన పయనిస్తుండడం వల్ల వ్యవస్థ కుంటుబడి పోయింది. ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసెస్ వ్యవస్థను కేంద్ర ప్రభుత్వం సరిదిద్దాల్సి వుంది.

కావలి — బి. కొండయ్య

## దుర్గామిట్ట అనడం తప్పుకాదు

నెల్లూరులో దర్గాలు వున్న మిట్ట ప్రదేశాన్ని దర్గామిట్ట అని పిలుస్తున్నారు. ఈ ప్రదేశానికి దక్షిణ వైపున శివాలయం, రాజరాజేశ్వరి అమ్మవారి దేవాలయాలు వున్నాయి. ఇవి కూడా మిట్ట ప్రదేశంలో వున్నాయి. రాజరాజేశ్వరి అమ్మవారు దుర్గ అయినందువల్ల ఈ ప్రదేశాన్ని దుర్గామిట్ట అని పిలవడం పొరపాటు కాదు. పోస్టల్ స్టాంప్ మీద దుర్గామిట్ట అని ముద్రించడం తప్పుకాదని నా భావన.

నెల్లూరు — సురభిరామయ్య

## 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

చెప్పిరి. తర్వాత ఈ సంఘం తరఫున కార్యదర్శి నేలనూతల సుబ్బరాయుడు గారు, మున్నగు పెద్దలు నెల్లూరు పవర్ అండ్ లైటు కంపెనీవారి ప్రతినిధి చక్రవర్తి అయ్యంగారితో సంప్రతించగా సెప్టెంబరు ఆఖరుకు సర్ ఛార్జి తీసివేయబడునవియు, యూనిట్ 1కి 0-6-0 రేటుగాక ఫ్యూయల్ ఛార్జెస్ క్రింద 0-1-3 మాత్రం అధికంగా వసూలు చేయుటకు అనుమతి ఇవ్వవలసిందిగా ప్రభుత్వాన్ని కోరివున్నామనియు, ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం రేటు నిర్ణయించబడుననియు, కొత్త కనెక్షన్లకు 150 రూపాయలు డిపాజిట్లు విషయంలో చట్ట ప్రకారం వాడుకొనువారు చెల్లించవలసిన మొత్తం పోను మిగతా మొత్తం ఆ వ్యక్తి పేరుతో తమ లెక్కలలో జమ వ్రాసుకొని, నిదానంగా మజరా యివ్వబడునని చెప్పిరట. అనగా కొత్తగా 150 రూపాయలలో నుండి షుమారు 75 రూపాయలు ఖర్చులగుననియు, తక్కిన 75 రూపాయలు వారు కొనవలసిన మీటర్లు వగైరాలకు క్రొత్త కనెక్షన్‌దార్లు పెట్టుబడి పెడితే, వెనుక మజరా ఇస్తారని అర్థం.

### నెల్లూరు క్షయ హాస్పిటల్‌కు శంకుస్థాపన

2తేది సాయంత్రం నాలుగు గంటలకు దర్గామిట్టలో మద్రాసు ప్రావిన్షియల్ వెల్ఫేర్ ఫండువారిచే నిర్మింపబడనున్న క్షయ ఆసుపత్రి శంకుస్థాపన ఆరోగ్య శాఖామంత్రి రాజన్ గారిచే జరుపబడింది. వేదికపై మంత్రులు గోపాలరెడ్డి, రాజన్, భక్తవత్సలం గారలు, తిక్కవరపు రామిరెడ్డిగారు కూర్చొన్నారు.

తిక్కవరపు రామిరెడ్డి గారు ఈ కార్యక్రమం నాటికి ముందు రోజు అప్పటికప్పుడు అనుకోని కొందరిని కలసినప్పుడు వారు వాగ్దానము చేసిన విరాళములు ప్రకటించారు. తన వదిన, మరదలు 20వేల ఖరీదులో ఒక జనరల్ వార్డునూ, 10వేలలో మహబూబ్‌ఖాన్ గారొక వార్డును, రేబాల లక్ష్మీనరసారెడ్డి గారు ఒక వార్డును కట్టి ఇచ్చుటకు సమ్మతించారని, ఎసి సుబ్బారెడ్డి గారు వేణుగోపాల స్వామి నిధిలోంచి 25వేలు ఇప్పించుటకు ఒప్పుకొన్నారని తాము అందరినీ కలసి కోలేదని తలచక ప్రతి ఒక్కరు ఇతోధికంగా విరాళము ఇచ్చి సంస్థకు తోడ్పడవలెనని రామిరెడ్డి గారు కోరారు. అధ్యక్షత వహించిన మంత్రి గోపాలరెడ్డి గారు మాట్లాడుతూ జిల్లాలో జరుగుతున్న అనేక విషయాలలో కెల్లా ఇది అత్యుత్తమమైన దన్నారు.

### నెల్లూరు ముచ్చట్లు కోతుల బాధ

అధికాహార్పత్తి కార్యక్రమంలో కోతుల సంహారం కూడా కలపక పోతే ప్రయోజనం లేదు. హిందువులకు కోతులను చంపకూడదనే ఆచారం వున్నది. ఆంజనేయులు కోతి జాతికి చెందినవాడనే కారణమనే మానసికంగా బాధిస్తున్నది.

- విమర్శకుడు

## నెల్లూరుసంగతులు

4వ పేజీ కొరవ

లోని పరిస్థితుల కారణంగా నేరస్తులుగా మారారే కాని పుట్టుకతో నేరస్తులు ఎవరూ కారన్నారు. ఖైదీలను వుంచే జైలును పరివర్తనాలయంగా పేరు మార్చేందుకు ప్రభుత్వం త్వరలో చట్టం రూపొంది స్తున్నదని చెప్పారు. ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన మొదటి అదనపు జిల్లా సెషన్స్ జడ్జి కృష్ణమోహన్‌రెడ్డి మాట్లాడుతూ ఖైదీల పట్ల అధికారులు తమ విధులను సక్రమంగా నిర్వర్తించ వలసిన అవసరం వుందన్నారు. ఖైదీలలో దాగున్న వృత్తిపరమైన, విద్యాపరమైన నైపుణ్యాన్ని గుర్తించి వాటిని వెలికి తీసి ఖైదీలను సన్మార్గంలో నడిపేందుకు కృషి చేయాలన్నారు. రెండవ అదనపు జిల్లా సెషన్స్ జడ్జి యు. దుర్గాప్రసాద్ రావు మాట్లాడుతూ మానవునిలో నిగ్రహశక్తి లేని కారణంగా సమాజంలో నేరాలు పెరిగి పోతున్నాయన్నారు. జైలు సూపరింటెండెంట్ అనంతరావు జైలులో ఖైదీల సంక్షేమానికి చేపడుతున్న కార్య క్రమాలను గూర్చి వివరించారు. ఖైదీలకు మెరుగైన సౌకర్యాలు అందించేందుకు త్వరలో నెల్లూరులో కొత్త జైలు నిర్మాణం జరుగుతున్నట్లు చెప్పారు. వివిధ పోటీల్లో గెలుపొందిన ఖైదీలకు కలెక్టర్, జడ్జీలు బహుమతులందించారు.

### లయన్స్‌క్లబ్ సేవా కార్యక్రమాలు

లయన్స్ క్లబ్ ఆఫ్ పినాకిని - నెల్లూరు అక్టోబర్ 2తేది చార్టర్ నైట్‌ను పురస్కరించుకొని క్లబ్ జిల్లా గవర్నర్ జి. నరసింహాలు చేతుల మీదుగా పలు సేవా కార్యక్రమాలను నిర్వహించింది. 22 మంది లయన్స్ క్లబ్ సభ్యులు రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్‌లో రక్తదానం చేశారు. కొండాయపాళెం వద్దగల వాత్స ల్య అనాధ పాఠశాలలోని 100 మంది అనాధ బాలలకు కొత్త దుస్తులు ఇచ్చారు. సంతపేటలోని రాధాకృష్ణ అప్పర్ ప్రైమరీ ఎయిడెడ్ స్కూల్‌లో అదనపు గదుల నిర్మాణానికి 11వేల రూపాయలు చెక్కును ప్రధానోపాధ్యా యునికి అందజేశారు. ఈ కార్యక్రమాల్లో క్లబ్ అధ్యక్ష కార్యదర్శులు రాజగోపాల్, ఎస్. సుబ్రహ్మణ్యం కూడా పాల్గొన్నారు.

### జయప్రకాష్ నారాయణ్ జయంతి సభ

లోక్‌నాయక్ జయప్రకాష్ నారా యణ్ 99 వ జయంతి సభ 11తేది సాయంత్రం టౌన్‌హాల్‌లో జరుగుతుంది. సభకు కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రి ముప్పవరపు వెంకయ్యనాయుడు, న్యాయమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి, హైకోర్టు న్యాయమూర్తి బి. సుదర్శన్‌రెడ్డి, డాక్టర్ జి.ఆర్.ఎస్. రావు విచ్చేస్తారు. సభకు మాజీ అసెంబ్లీ స్పీకర్ బెజాల దశరథ రామిరెడ్డి అధ్యక్షత వహిస్తారని, కార్యక్రమ నిర్వాహకుడు తుంగా పాండురంగారెడ్డి చెప్పారు.

### ఆంధ్రా ఛాంబర్ ఆఫ్ కామర్స్ సభ్యుడు

చెన్నైలోని ఆంధ్రా ఛాంబర్ ఆఫ్ కామర్స్ కార్యవర్గ సభ్యునిగా నెల్లూరీ యుడు కె.వి. చలమయ్య ఎన్నికయ్యారు. ఈ ఛాంబర్ ఎన్నికలు సెప్టెంబరు 29 తేది చెన్నైలో జరిగాయి. ఆంధ్రా ఛాంబర్ ఆఫ్ కామర్స్ సంస్థ 1922లో స్థాపించ బడింది.

### టీచర్ల ఫలితాల విడుదలలో విఫలం

డిఎస్‌సిని నిర్వహించిన 15 రోజులకే ఫలితాలను విడుదల చేస్తామని ప్రకటించిన ప్రాథమిక విద్యాశాఖ మంత్రి కడియం శ్రీహరి ఆచరణలో విఫలం చెందారని జిల్లా దళిత విద్యార్థిసేన అధ్యక్షుడు ఎ. పూర్ణప్రకాష్ విమర్శించారు. కొత్త వారికి పోస్టింగులు ఎక్కడ ఇస్తా రన్నది అర్థం కావడం లేదని, రేషనలైజేషన్‌లో పోస్టులన్నీ అదృశ్యమయ్యాయని విమర్శించారు.

## సినిమా

9వ పేజీ కొరవ

చిత్రంలో హీరోయిన్. హైదరాబాద్‌కు చెందిన నీలాంబరి బాచి చిత్రంలో జగపతిబాబు సరసన నటిస్తుంది. బొంబా యిలో స్థిరపడ్డ తెలుగమ్మాయి జయలక్ష్మి ఎస్వీ కృష్ణారెడ్డి దర్శకత్వంలో తయారయ్యే సకుటుంబ సపరివార సమేతంగా నటిస్తుంది. ముంబాయి మోడల్ రిచా నువ్వేకావాలి ద్వారా తెలుగు తెరపై కనపడనుంది. ఇందులో ఎందరు నిలదొక్కుకొంటారో?

## బిల్లులు

4వ పేజీ కొరవ

మెంట్, హెల్త్, లేబర్ ఆఫీసర్లు తమకు లభించే జీతాలకు రెండింతలు, మూడింతలు వ్యాపారస్తుల దగ్గర నుంచి లాగి కుబేరులై పోతున్నారు. ప్రభుత్వం ఖజానాను మాత్రం వట్టిపోయేలా చేస్తున్నారు. రోజుకు 50లక్షల వ్యాపారం జరిగే కిరణా మార్కెట్‌లో ఇంత మాయాజాలం చేస్తున్న అధికారులు, ఇతర వ్యాపారస్తుల నుండి ఎంత సంపాదిస్తున్నారో అంచనా వేయడమే కష్టమవుతుంది. ఇంత జరుగుతున్నా అవినీతి నిరోధక శాఖాధికారులు ఏం చేస్తున్నారో అర్థమే కావడం లేదు.

## ప్రాణప్రదం

7వ పేజీ కొరవ

ప్రభుత్వాన్ని పతనం చేసింది ఎన్‌టి. రామారావుగారే అయినా, ఆయన రంగ ప్రవేశం చేసే నాటికి కాంగ్రెస్ ప్రభుత్వం పట్ల ప్రజలలో అయిష్టత ఏర్పడడానికి ఎన్‌టి. రామారావుగారికి అనుకూల వాతావరణం సృష్టించడానికి నేను అసెంబ్లీ లోపల, బయట నిర్వహించిన పాత్ర కూడా కొంత దోహదం చేసింది. నా కృషిని ప్రజలు, పత్రికలు కూడా గుర్తించాయి. నాకెంతో సంతృప్తి కల్గించిన విషయం అది. నన్ను గెల్పించిన ఉదయగిరి నియోజకవర్గ ముఖచిత్రం మార్చాను. నేను ఎమ్మెల్యేగా ఎన్నికయ్యే నాటికి ఉదయగిరిలో కేవలం 8శాతం గ్రామాలకు కరెంట్ వుండేది; దాన్ని 90 శాతానికి పెంచాను. హైస్కూళ్ల సంఖ్య 4 నుంచి 12కి పెంచాను; ఒక కాలేజి పెట్టించాను; సాగు నీరు, త్రాగునీరు వసతులు పెంచాను. రాజకీయాలలోకి రావడం వల్లనే కదా ఇది సాధ్యమయ్యింది.

జ.రై.: ఈ రాజకీయాలలోకి ఎందుకు వచ్చామా అన్న నిర్వేదం కల్గించిన సందర్భం ఏదైనా వుందా?

నాయుడు: నిజమే. అప్పుడప్పుడు నాకు ఇటువంటి నిర్వేదం కల్గుతున్న మాట నిజమే. అసెంబ్లీ లోపల ఎమ్మెల్యేల ప్రవర్తన దిగజారుతున్న తీరు, సరైన కారణాలు లేకుండా ప్రభుత్వాలను పడగొడుతున్న సంఘటనలు చూసినప్పుడు; రాజకీయవాదుల పట్ల ప్రజలలో రోజు రోజుకి గౌరవం తగ్గిపోయి చులకన భావం పెరుగుతున్న పరిణామాన్ని గమనించినప్పుడు రాజకీయాల పట్ల నిర్వేదం కల్గుతున్న మాట వాస్తవమే. ఆ దిగజారుడు నాకు సంక్రమించకూడదని భగవంతుడ్ని ప్రార్థిస్తున్నాను.

జ.రై.: నెల్లూరు వారై వుండి కూడా మీరు నెల్లూరును, నెల్లూరు జిల్లా సమస్యలను పట్టించుకోరనే విమర్శ వుంది.

నాయుడు: అది వాస్తవం కాదు. దాదాపు పదేళ్ల నుంచి జాతీయ రాజకీయాలలో వుండడం వల్ల నెల్లూరుతో సంబంధాలు తగ్గి వుండవచ్చు కాని, నెల్లూరును మర్చిపోవడం జరుగదు. నెల్లూరు రైల్వే స్టేషన్లో తూర్పు వైపు కొత్త బుకింగ్ కౌంటర్, ఫుట్ బ్రిడ్జివంటివి మంజూరు కావడానికి నేను చాలా ప్రయత్నం చేశాను. మద్రాసు నుంచి లోకల్ రైళ్లు నడిపించడానికి రైల్వే అధికారులను వప్పించాను. ప్లాట్‌ఫారం ఎత్తు చేయగానే లోకల్ రైళ్లు నడుస్తాయి. కోవూరులో ఎఫ్‌సిఐ గోడౌన్లు శాంక్షన్ చేయించాను. దీని వల్ల రైతులకు లాభం కల్గుతుంది. ఇవి చిన్న పనులే. కాని నెల్లూరును నేను విస్మరించలేదు అని చెప్పడానికి ఇవి ఉదాహరణలు.

జ.రై.: జాతీయ నాయకత్వ స్థాయికి మీరు ఎదిగారు తప్ప, నెల్లూరు జిల్లాలో మీ పార్టీ మాత్రం ఎదగడంలేదు, అందుకు మీరు కృషి చేయడం లేదన్న విమర్శ కూడా వుంది.

నాయుడు: అది వాస్తవం కాదు. తతిమా సర్కార్ జిల్లాలతో పోల్చి చూస్తే నెల్లూరు జిల్లాలో బిజెపి బాగా పెరిగింది. 1996 పార్లమెంట్‌ఎన్నికలలో బాల కొండయ్య గారికి కోస్తా జిల్లాలన్నిటి లోకంటె అధికంగా ఓట్లు వచ్చాయి. ఆత్మకూరులో ఆంజనేయరెడ్డి ఎమ్మెల్యేగా పోటీ చేసినప్పుడు దాదాపు విజయం వరించింది. పార్టీ బలంగా వుండడం వల్లనే ఇది సాధ్యమయ్యింది. ఇప్పుడు గోదావరి జిల్లాల్లో బిజెపి పెరుగు తున్నదని కాని, మొదటి నుంచి కోస్తా కంతటికి నెల్లూరు మా పార్టీకి చాలా ముఖ్యమైన జిల్లా. ఆ ప్రాముఖ్యత పెరిగిందే తప్ప తగ్గలేదు.

జ.రై.: కేంద్ర మంత్రిగా నెల్లూరుకు ఏదైనా మంచి పని చేసిపెడతారా?

నాయుడు: అందరి సలహాలు తీసుకుని నేను చేయగల్గిన ప్రతి ఉపకారం చేసి తీరుతాను. గ్రామాల అభివృద్ధి నాకు ఎంతో ఇష్టమైన విషయం. ఇప్పటికీ పల్లెటూళ్లలో, పచ్చటి చేలు చూస్తే కల్గే ఆనందం నాకు ఢిల్లీలో కలగదు. ఆరుబయట చొక్కా విప్పి, నులకమంచంపై వెల్లికిలా పడుకుని ఆకాశం వైపు చూస్తూ వుంటే ఎంత ఆనందమో. రాజకీయాల వల్ల అటువంటి చిన్న చిన్న అనుభవాలకు దూరమై పోయాను. నెల్లూరు జిల్లా, ఉదయగిరి నియోజకవర్గం నాకు రాజకీయ జన్మ ప్రదాతలు. ఢిల్లీ మంత్రి అయినప్పటికీ నా జీవన వృక్షానికి వేళ్లు పాతుకుని వుండేది అక్కడే. జిల్లా అభివృద్ధికి నా వంతు కృషిలో లోపం రానివ్వను. ఈ మధ్యనే కుమూరు దర్గాకు కొంత కేంద్ర నిధి మంజూరు చేయించాను; రంగనాథస్వామి దేవస్థానం అభివృద్ధికి కూడా కేంద్ర సహాయం ఇప్పించడానికి ప్రయత్నిస్తున్నాను. జిల్లాలోని పెద్దలు సలహాలిస్తే ఏ మంచి పనికైనా నా పరిధిలో నేను ప్రయత్నిస్తాను. *

## సణుగుడు

2వ పేజీ కొరవ

భవిష్యత్తులోనైనా ఇటువంటి మోసాలకు పాల్పడకుండా వుంటారనే వుద్దేశ్యం తోనే వీరి ముఖాన కెకరించి వుమ్మినట్లు వ్రాస్తుండేది.

డిఐజి గారూ, మీరైనా ఖాకి చొక్కాకు, భుజం మీద తగిలించుకున్న రాజముద్రికకు విలువ ఇచ్చేవారైతే ముందు మీ శాఖలో వుండే బందిపోట్లపై చర్య తీసుకోండి. జనాన్ని దారుణంగా దోచుకున్న దొరలను పట్టి కటకటాల వెనక పెట్టండి. అప్పుడు నమ్ముతారు మిమ్మల్ని ప్రజలు.*

## రైతుబిడ్డ

మొదటి పేజీ కొరవ

చెప్పాలంటే, మంత్రిత్వం తీసుకోవడానికి సంకోచించాడు. ప్రభుత్వంలో కంటే పార్టీలో తాను బాగా పనిచేయగలనని ప్రధానికి విన్నవించాడు. కాని ఒక ప్రక్క వాజ్‌పాయి, మరొక ప్రక్క స్నేహితులు వత్తిడి చేయడంతో వప్పుకోక తప్పలేదు. పాతికేళ్ల ప్రజాజీవితంలో వెంకయ్య నాయుడు స్వీకరించిన ప్రథమ ప్రభుత్వ బాధ్యత ఇది.

నమ్మిన సిద్ధాంతం పట్ల చిత్తశుద్ధి, ఫలితం కోసం ఎదురు చూసే సహనం, ప్రలోభాలకు లొంగని దృఢ సంకల్పం, తాత్కాలిక ప్రయోజనాలను స్మరించ గల్గిన త్యాగగుణం, నిలకడ వంటి లక్షణాలన్నీ కలబోసిన వ్యక్తి వెంకయ్య నాయుడు. ఎప్పుడు పదవుల కోసం తాపత్రయపడలేదు; పార్టీలు మారలేదు; పల్టీలు కొట్టలేదు. కాంగ్రెస్ ప్రభుత్వా లలోకి రమ్మని ఆయనకు ఎన్ని మార్లు పిలుపు వచ్చిందో లెక్కలేదు. ఆ ఆహ్వా నం అందుకొనివుంటె రెండు దశాబ్దాల క్రిందే మంత్రి అయివుండేవాడు. వరస జెట్టి ఒంగోలులో, బాపట్లలో, ఆత్మకూరు లో, హైదారాబాద్‌లో ఓటమి చవి చూసినా నిరుత్సాహం చెందలేదు. ఓడి పోయిన దిగులు వుండివుంటె ఈ ఎత్తుకు ఎదిగేవాడు కాదు. ఆ దిగులు లేక పోవడానికి కారణం - పదవి మీద ప్రేమ లేక పోవడం. పార్టీ ఆదేశం ప్రకా రం ఎన్నికలలో నిలబడడం తప్ప తన సుఖం కోసం పదవులు పొందాలన్న తపన ఎప్పుడూ చూపలేదు. అందువల్లే ఓటములు ఎన్ని ఎదురైనా ఆయనలో వుత్సాహం తరగలేదు.

వెంకయ్య నాయుడు నోటిలో పడి నల్గని నాయకుడు రాష్ట్రంలోనే కాదు, దేశంలోనే లేడు. కాంగ్రెస్ నేతలను మాటల ఈటెలతో తూట్లు పొడవడం ఆయనకు సరదా. గంగ ప్రవాహానికైనా అడ్డు వుంటుంది కాని, వెంకయ్య వాక్ఝరికి ఆనకట్టలే వుండవు. అందరిని అన్ని తిట్లు తిట్టినా, ఆయన్ను తిరిగి తిట్టగల్గిన వారు లేరు. ఇంకొకరు తనను వేలెత్తి చూపించే అవకాశం ఇవ్వలేదు నాయుడు గారు. ప్రజా జీవితంలో ఆయన ఏ చిన్న తప్పు చేసివుండినా, బలహీనతకు లోనై వుండినా ఇతర పార్టీల వారు చీల్చి చెండాడి వుండేవారు. ఇప్పుడు ఆయన మంత్రి అయితే స్వంత పార్టీ వారికంటె కాంగ్రెస్, కమ్యూనిస్టులతో పాటు, ముస్లిం నేతలు కూడా అభినందనలతో ముంచెత్తు తున్నారు ఆయనకు వచ్చిన ఫోన్లు గమనిస్తే వెంకయ్య నాయుడు ఎంతగా ఎదిగి పోయాడా అన్పించింది. ఆయనకు వచ్చిన పదవుల కంటె, సంపాదించు కున్న స్నేహితుల సంఖ్య చాలా అధికం.

నాయుడు గారి గురించి ఈ పత్రిక లో వ్రాయడమంటె అమ్మ పుట్టిల్లు మేన మామ దగ్గర పొగిడినట్లుంటుందని తెల్సు. ఆయన్ను తెలియనివారు నెల్లూరు జిల్లాలో ఎవరున్నారు? అయినా ఒక నెల్లూరు రైతు బిడ్డ ఢిల్లీ గద్దె ఎక్కినా డంటె ప్రతి నెల్లూరీయుడికి గర్వకారణం కాదా? అందుకే ఈ నాలుగు మాటలు.

వెంకయ్య నాయుడు గారి వయస్సు 49 సంవత్సరాలు. చిన్న వయస్సు ఇది. ఆయన ఎక్క వల్సిన మెట్లు ఇంకా ఎన్నో వున్నాయి; సాధించవల్సిన విజ యాలు చాలా వున్నాయి; అధిరోహించ వల్సిన సోపానాలు కూడా ఎదురు చూస్తున్నాయి. నాయుడు గారు తన పదవికి వన్నె తెస్తాడని మా నమ్మకం. అది జరగాలంటె ఆయన ఇప్పటి వరకు పార్టీ కోసం ఎట్లా పని చేశాడో, ప్రభుత్వం లోనూ అదే తీరులో కష్టపడాలి; ప్రజలకు మేలు చేసే పనుల ద్వారా ప్రజా హృదయాలలో నిలిచి పోవాలి; ఆయనకు మా హృదయపూర్వక శుభాకాంక్షలు.

***

నాయుడు గారు తీసుకున్న శాఖ గ్రామీణాభివృద్ధి. తీసుకున్న అని ఎందుకంటున్నామంటె - మంత్రిత్వంతో పాటు తనకు కావల్సిన పోర్ట్‌ఫోలియో ఎంపికలోనూ ఆయనకు పూర్తి స్వేచ్ఛ ఇచ్చాడు ప్రధానమంత్రి వాజ్‌పాయి. ప్రధాని మొదట ఇవ్వచూపిన శాఖ విద్యుత్. అది చాలా వివాదాస్పదమైంది కావడంతో మొదటిసారి ప్రభుత్వంలోకి వస్తు తంటాలు తలకెత్తుకోవడం ఎందుకని నాయుడు గారే దాన్ని నిరాకరించాడు. ఫర్టిలైజర్లు, ఇన్‌ఫర్మేషన్ శాఖలను సైతం ఆయన వద్దు అని చెప్పేశాడు. స్నేహితుల సలహాపై గ్రామీణాభివృద్ధిని ఎంచుకున్నాడు.

ప్రజలకు, పల్లెటూళ్లకు సేవ చేయడానికి ఇంతకంటె మంచి విభాగం కేంద్రంలో మరొకటి లేదు. దేశంలోని కొన్ని లక్షల గ్రామాల అభివృద్ధికి నచ్చిన పథకం ప్రవేశపెట్టడానికి, కోరినంత డబ్బు సమకూర్చుకోవడానికి ఈ శాఖలో స్వేచ్ఛ వుంది. దీని బడ్జెట్ వేల కోట్లలో వుంటుంది. గ్రామీణ గృహ నిర్మాణం, రోడ్లు వేయడం, చిన్న చిన్న పరిశ్రమలను పెట్టించడం, ప్రాథమిక వసతులు కల్పించడం వంటి పనులన్నీ చేయవచ్చు. ఇన్‌ఫర్మేషన్ వంటి పోర్ట్‌ఫోలియోలో కేవలం ప్రచారం మాత్రమే వస్తుంది; దీనిలో నిజమైన అభివృద్ధి సాధ్యమౌ తుంది. అందుకే ఆయన దీన్ని ఎంపిక చేసుకున్నాడు. *

## డి.కె.డబ్ల్యు

4వ పేజీ కొరవ

సహజంగా ఈ కాలేజిలో మెస్ మెయింటెనెన్స్, విద్యార్థినుల పరిరక్షణకు ఒక డిప్యూటీ వార్డెన్, ఒక లేడి లెక్చరర్ హాస్టల్ అన్ని వేళలా వుండాలి. ప్రస్తుతం ఎవ్వరూ ఉండటం లేదు. నిర్మల అనే నాల్గవ తరగతి ఉద్యోగికి ఈ బాధ్యతలు అప్పచెప్పడంతో వ్యవహారం గందరగోళంగా తయారయ్యింది. రాత్రుళ్లు పురుషులు హాస్టల్ వద్ద తారసపడుతున్నా పోలీసు రిపోర్టులు లేవు. ఇటీవల ఒక అమ్మాయి నిద్రమాత్రలు మింగింది. మరో అమ్మాయి ఆత్మహత్యకు ప్రయత్నించింది. కాని కారణాలు తెలియడం లేదు.

వేమాలయ్య అనే జూనియర్ అసిస్టెంట్ కాలేజిలో సర్వాధికారాలు చెలాయిస్తున్నాడట. ఆదివారం పూట కాలేజి ఆఫీసులో కూర్చొని మద్యం సేవిస్తూ, ఆ సమయంలో విద్యార్థినులకు పనులు చెప్పి పెంటనే రమ్మని పిలుస్తున్నాడట. గతంలో ఇతని చేష్టలకు కాలేజిలో విద్యార్థినులు చెప్పులతో సత్కారం చేసినా ఇతనికి ప్రస్తుత ఇన్‌ఛార్జ్ ప్రిన్సిపాల్ ముఖ్యబాధ్యతలు ఎందుకు అప్పచెప్పారో అర్థం కావడం లేదు. గతంలో ఇతను కక్ష కట్టి కనుమూరు, బెజ్జకు చెందిన ఇద్దరు అమ్మాయిల సంవత్సరాంతపు పరీక్షల ఆన్సర్ షీట్లు మాయం చేశాడట. కాలేజిలో చదువులు కూడా దిగేరుస్తున్నాయి. కాలేజి పూర్తికాలపు ప్రిన్సిపాల్, హాస్టల్‌లో డిప్యూటీ వార్డెన్, ఇన్‌ఛార్జ్ లెక్చరర్స్‌ని నియమించి క్రమశిక్షణ పాదుకొల్పడంతోపాటు, అవినీతి ఆరోపణలపై విద్యాశాఖాధికారులు విచారణ జరపాల్సి వుంది.

## ఎక్సైజ్

4వ పేజీ కొరవ

రక్షించను తామే క్యాష్ కౌంటర్లలో కూర్చుంటున్నారు. బ్రాందీ షాపుల్లో అప్పుపెట్టి తాగి వెళ్లి బాకీ చెల్లించని వారి ఇళ్లపై దిమ్మిక ఎక్సైజ్ పోలీసులే గూండాల మాదిరి వస్తుండడం విశేషం. కొన్ని షాపుల్లో అర్ధరాత్రి వరకు అనధికార వ్యాపారం జరుగుతోంది. 24 గంటలు బూత్‌లో మద్యం దొరికే మద్రాస్ బస్టాండ్ సెంటర్‌లోని షాపు వద్ద రక్షకులుగా ఎక్సైజ్ పోలీసులే వ్యవహరిస్తున్నారు. నైట్ డ్యూటీలు చేసే సివిల్ పోలీసులకు, ఎక్సైజ్ పోలీసులకు ఈ విషయమై ప్రతి దినం గొడవలు జరుగుతున్నాయి. నెల్లూరుకు కొత్తగా వచ్చిన ఎక్సైజ్ సూపరింటెండెంట్ మీరు ఏ రకంగానైనా వ్యాపారం చేయండి; నా వాటా నాకివ్వండని మద్యం షాపుల వారిని ప్రోత్సహిస్తున్నట్లు తెలిసింది. దీనివల్లే గాంధీ జయంతి రోజు కూడా బూత్‌లో బ్రాందీ ఎటువంటి ఇబ్బంది లేకుండా మందుబాబులకు దొరికింది. షాపుల్లో చిన్న షేర్ ఇస్తే ఎక్సైజ్ పోలీసులు దానవులకన్నా ఎక్కువగా పనిచేస్తూ అన్ని విధాలుగా అండగా నిలబడుతుండడంతో బ్రాందీ షాపుల యజమానులు కూడా ఈ 'దోస్తీ' పదిలంగా కొనసాగిస్తున్నారు.

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

ధర్మబద్ధంగా పాలిస్తాడు. ఆ రాముడిలాగే రామయ్య సర్కిల్ ఇన్స్‌పెక్టర్‌గా న్యాయం, ధర్మం కోసం పాటుబడ్డాడు కాబట్టి ప్రజలంతా అతన్ని "అయోధ్యరామయ్య" అని పిలిచారు. ఇక రెండవ పోలీస్ పాత్ర ఎస్పీ పట్నాయక్. ఇతను అయోధ్య రామయ్య కుమారుడు. అన్యాయం జరిగినచోట వెంటనే న్యాయాన్ని నిలిపే చురుకైన అధికారి. తన తల్లి (భానుప్రియ) ద్వారా తన తండ్రిపై జరిగిన దురాగతాన్ని ప్రతీకారంగా దుర్మార్గులను హతమారుస్తుంది ఈ పాత్ర.

ఈ రెండు పాత్రలను ద్విపాత్రాభినయంగా శ్రీహరి విజయవంతంగా పోషించాడు. అయోధ్య రామయ్య భార్యగా, పట్నాయక్ తల్లిగా భానుప్రియ సమాజంలో విజృంభిస్తున్న అరాచకాలపై స్త్రీ శక్తిని ప్రయోగించి సరికొత్త బాణీలో నటన ప్రదర్శించింది. అణువణువునా రాజకీయ దుర్గంధం అలముకున్న దేశద్రోహి జవహర్ రెడ్డి పాత్రలో దేశ పవిత్రతను పంకిలం చేసే రీతిని కోట శ్రీనివాసరావు చక్కగా నిర్వహించాడు.

పోసాని కృష్ణమురళి కథ, మాటలు, స్క్రీన్‌ప్లే వ్రాశాడు. కథ పోలీసు ఔన్నత్యాన్ని, వారి లోపాలను చూపే పాత ఇతివృత్తంగా సాగింది. కథనం కొత్త సన్నివేశాలతో ఊహించని మలుపులతో ఆకట్టుకుంటుంది. మాటలు అగ్నిశిఖలై జ్వలించాయి, ఫిరంగులై ధ్వనించాయి. వందేమాతరం శ్రీనివాస్ సంగీతం పాటల విలువ పెంచింది. జస్వంత్ కెమెరా, శ్రీహరి స్టెప్పులను, ఫైట్లను వివిధ కోణాల్లో ఆకర్షణీయంగా చేసింది.

ప్రజాజీవితానికి రక్షణ అయిన పోలీస్ డిపార్టుమెంటులో మంచిని పెంచి, పోలీస్ అధికారులంతా న్యాయానికి ధర్మానికి పూజారులై, డిపార్టుమెంటు ఔన్నత్యాన్ని ఉన్నత శిఖరంలో నిలుపమన్న ఆదర్శపు పోరు ఈ చిత్రంలో మెరుస్తుంది. దర్శకుడు తన ప్రతిభా పాటవాలతో పాత్రలను, పాత్రధారుల నటనను, మాటలను, పాటలను, వేడి వేడి విప్లవానికి ప్రయోగాత్మక నినాదాలుగా చేసి దేశప్రజల రక్తాన్ని త్రాగే క్రూరమృగాల మీదికి ఈ చిత్రాన్ని రామబాణంగా సంధించాడు. రాజకీయ దోపిడి చరిత్రను జనశక్తితో సమాధి చేసేందుకు ఇలాంటి చైతన్యవంతమైన చిత్రాలు అవసరం.



# బాష్పాంజలి

మంచికి మారుపేరుగా నిలిచి, అందరకీ ఆత్మీయునిగా,
సేవాదృక్పథంతో అందరి ఆదరాభిమానాలు పొందినటువంటి మచ్చలేని
మహా మనిషి, మాలో ఒకరిగా మెలిగి దైవసన్నిధికి చేరిన పెద్దలు

## శ్రీ సోమిరెడ్డి రాధాకృష్ణారెడ్డి గారి

అకాల మరణం పట్ల చింతిస్తూ, వారి పవిత్ర ఆత్మకు శాంతిని
కల్గించమని ఆ సర్వేశ్వరుని ప్రార్థిస్తూ, వారి కుటుంబ సభ్యులకు
మా ప్రగాఢ సానుభూతిని తెలియజేస్తున్నాము.



**కీ.శే. సోమిరెడ్డి రాధాకృష్ణారెడ్డి గారు**
డైరెక్టర్, జిల్లా కో-ఆపరేటివ్ బ్యాంక్
మరియు తోటపల్లిగూడూరు పి.ఏ.సి.యస్.



**పాలకవర్గ సభ్యులు**, పి.ఏ.సి.యస్., తోటపల్లి గూడూరు.

**మేడా శ్రీనివాసులురెడ్డి**, సూపర్‌వైజర్, పి.ఏ.సి.యస్., టి.పి. గూడూరు

| | |
|---|---|
| **రావుల వెంకయ్య** | **తంగిశెట్టి నాగరాజు** |
| వైస్ ప్రెసిడెంట్ | కార్యదర్శి |
| పి.ఏ.సి.యస్., టి.పి. గూడూరు | పి.ఏ.సి.యస్., టి.పి. గూడూరు |

KUMAR'S, Ph: 335872

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354, Offset Printing at Zaminryot Press, Nellore.